కంటెను మీాదనున్న అంతస్థులోనే బసకావలయుననికోరియుంటచే, హోటలుయజమాని ఆగది పరిశుభ్రముగాలేకపోయినను, వానికిచ్చి నాడు. ఆత డందులో గాలిడుటతోనే — ముందుగా నొకగ్లాసు తేనీటిని దీసికొనిరమ్మని సెర్వరునకాజ్ఞాపించినాడు. తా నాహోటలులోనున్నంత కాలము — భోజనపదార్థములను — అల్పాహారమును, తనకాగదిలోనికే తీసికొనిరావలయుననియు ననవసరముగా ద న్నెవలనుపిలువ రాదనియు నాతడు హోటలుయజమాని కాజ్ఞాపించినాడు.

26 వ నెంబరు గదికి కుడిప్రక్కనున్న గవాక్షము వెనుకనున్న వీధిని చూపుచుండును — ఉదయము — మధ్యాహ్నము — సాయంత నముకూడ నందులో ప్రవేశించియున్న యువకుడు కిటికీ చెంత గూరు చుండి గ్రాంటురోడ్డును దిలకించుచుండును. ఆతడు మాత్రము — మార్గము నరుసరించి, పోవువారికి కనబడడు. గదిని ఊడ్చుటకు సేవ కుడు వచ్చునప్పుడు తప్ప — ఆతడు తనగదియొక్క తలుపును తీయడు. బయటికిరాడు. ఎప్పుడు సిగరెట్టు కాల్చుకొనుచు నాగవాక్షముకడనే ఉపవిష్టుడై యుండును.

అతడా గదిలో ప్రవేశించిన వెనుక—మూడవనాటి సాయం కాలము "కాలింగ్ బెల్" మ్రోగించినాడు. వెంటనే హోటలు సేవకు డొకడు వచ్చి సవినయముగ జేతులను గట్టుకొని, నిలువబడి యుండెను — అసమయమున, కిటికీ తిన్నగా రోడ్డుమీాద—"హత్య! దారుణమగు హత్య! పీపిల్సుపార్కులో" అని వార్తాపత్రికలను జేత బట్టుకొని విక్రయించుచున్న పిల్లవా డఱచినాడు. సేవకునితో నాతడు తన కొకవార్తాపత్రికను గావలయునని చెప్పి పైకమిచ్చెను.

హోటలు సేవకుడు వార్తాపత్రికను కొని 26 వ నెంబరు గదిలో నున్న యువకునకందజేసెను — అందు — పీపిల్సుపార్కులో నొకడు హత్య కావింపబడినాడనియు, వాని పేరుగాని ఊరుగాని ఎవ్వరికిని

తెలియదనియు, మనుష్యుని పోల్చుకొనుటయే కష్టమనియు నున్నది. వార్తాపత్రికను గదిలోనున్న మేజాబల్లమీద జారవిడిచి — హోటలు సేవకుడు త్వరితగతిని క్రిందకుదిగి, ఆఫీసురూమునకు పోయెను. అక్కడ హోటలు యజమానియయిన "రమేంద్రదత్తు" ని దర్శించి — 26 వ నెంబరు గదిలో వసించుచున్న యువకుడు — "విచిత్రవ్యక్తి" యని చెప్పినాడు.

ఆమాటలకు రమేంద్రదత్తు ఉలికిపడెను; బొంబాయి నగరములో గల హోటల్సులో తనహోటలు చిన్నది — ఇంకను అభివృద్ధిదశ లోనికిరాలేదు. నగరమధ్యమున లేక — ఇంచుక మారుమూలనుండుట చేత — సామాన్యముగా విచిత్రవ్యక్తు లనేక లచ్చటకువచ్చి బసచేయు చుందురు. అట్టివారు సక్రమముగా తమబిల్లు మొత్తమును చెల్లించి నంతకాలము — వారిని గురించి యెట్టి విషయములను దెలిసికొనుటకు రమేంద్రదత్తు కుతూహలమును జూపడు. వారితో నాతనికి విశేషముగ జోక్య మక్కరలేదు.

26 వ నెంబరు గదిలోని యువకుడు రంగు హోటలులో ప్రవేశించి వారము దినములు గడచెను—ఆత డేడవనాడు — ఉదయముననే తాను హోటలును విడిచి వెళ్ళిపోవుచున్నానని చెప్పి, బిల్లును పూర్తిగా చెల్లించి—హోటలు సేవకునితో తన కొకబండి కావలయునని చెప్పెను.

"విక్టోరియా టెర్మినస్—రాయచూరు ఎక్స్‌ప్రెస్‌నకు పోవల యును — సరిగా తొమ్మిదిన్నరగంటలకు ట్రైను వచ్చును—" అను మాటలు వాని నోటినుండి వెలువడినవి. వాని కంఠములో ప్రశాంతత లేదు; ఆత్రత మధికముగా వ్యక్తపడుచున్నది.

సేవకుడు బండిని దీసికొనివచ్చెను — ఆయువకుని అనుమతి మీద 26 వ నెంబరు గదిలో వానికి చెందిన చిన్నసూటుకేసును మరి కొన్ని యితర సామానులను బండిలో పెట్టెను.

ఆయువకుడు బండిలో నెక్కుటకు ముందుగా—"విక్టోరియా టెర్మినస్—రాయచూర్ ఎక్స్ప్రెస్ — సరిగా తొమ్మిదిన్నరగంటలకు ట్రైను వచ్చును—" అని యింకను చెప్పుచుండగనే, బండివా డాతని మాట కడ్డువచ్చి, "అయ్యా! నేను మిమ్ములను సకాలములో స్టేషను కడ దింపెదను—" అని చెప్పినాడు. ఆతడు బండిలో ప్రవేశించెను—బండి సాగిపోవుచున్నది. హోటలు సేవకుడు, బండి కనుచూపు దూరములో నున్నంతవఱకు నిలువబడి చూచినాడు—"ఎవనిచేతనో తఱుము బడుచున్నాడు — నిజము — తఱుమబడుచున్నాడు; లేకున్న అంత భయమెందులకు ?" అని తనలో దానే ఆత డనుకొని, బండి ఉత్తరముగా తిరిగి పోవుట చూచి, లోనికి పోయినాడు.

బండి రెండుమూడు క్రాసు రోడ్డులను దాటి వేగముగా పోవుచున్నది. బండిలోని యువకుని నోటిలో నొకసిగరెట్టున్నది. దానికింకను నిప్పు అంటింపబడలేదు. ఆతడు బండియొక్క అద్దపుతలుపులసందునుండి, మాటిమాటికి ప్రక్కలకు చూచుచుండెను—ఏవ్యక్తిని జూచినను, అదిరి పడుచుండెను — వాని నేత్రములలో భయమపారముగానున్నది. ఆతని చర్యలను బట్టి చూడగా—ఎవ్వనికో భయపడి పాఱిపోవుచున్నవానివలె గన్పట్టుచున్నాడు. అంగీజేబులోని అగ్గిపుల్లను దీసి, సిగరెట్టును ముట్టించుటకు చేతులను పైకెత్తినాడు. అవి గడగడ వడకుచున్నవి.

అప్పటికి సూర్యరస్మి బాగుగా వీధులలోనలముకొన్నది. బండి మహావేగముతో చాలదూరమువఱకుపోయినది. అయిదు లేక పది నిముషములలో విక్టోరియాటెర్మినసు నాతడు చూడగలడు. కాని హఠాత్తుగా వానిహృదయములో నేమిఆలోచనము పొడసూపినదో చెప్పలేము—ఆతడు బండివానిని వెనుకనుండి బుజముమీదతట్టినాడు. బండివాడు త్రుళ్ళిపడి వెనుకకుతిరిగి బండిలోని పెద్దమనుష్యునివైపు దృక్కులను బఱపుచుండెను.

"గేట్ వే" యొద్దకు తీసికొనివెళ్ళుము — అనుమాటలు వాని చెవినిబడ్డవి. ఆత డాశ్చర్యచకితుడాయెను.

"బాబూ! టెర్మినస్ కడకని చెప్పితిరికదా?" అని అతడు తెల్ల బోయి చూచుచు ప్రశ్నించినాడు.

"కాదు — "గేట్ వే" యొద్దకు బండిని త్రిప్పిపోనిమ్ము."

సాధారణముగా గమ్యస్థానములలో ప్రయాణీకులనోటినుండి అట్టి మార్పులు వెలువడుచుండును. అందులకు బండివా డాశ్చర్యపడనక్కఱ లేదు. కాని ఆయువకుడు కొన్నినిముషములకుముందు — ప్రత్యేకముగా రాయచూర్ ఎక్స్ప్రెస్సునకుపోవలయునని నొక్కిచెప్పినాడు. అంతలోనే మరల "గేట్ వే"యొద్దకెందులకు? — బండివానికి సందేహముతోబాటు ఆశ్చర్యముకూడ కలిగినది. అతడు బండిని వెనుకకుమరల్చినాడు — "ఈతడెక్కడికి పోవుచున్నాడో? తన్నుతానే మరచియున్నాడు — తన గమ్యస్థానము తనకేబోధపడుటలేదు"—అని తనలోదాను సణుగుకొనుచు కొంతసేపటికి "వెల్లింగ్డన్ బ్రిడ్జి"ని దాటించి — బండిని గేట్-వే సమీపమునకు తోలినాడు. అదిహార్బరుప్రదేశము. హిందూదేశమునుండి యితరప్రదేశములకు ప్రయాణముచేయవలయునన్న బొంబాయినగరములో అక్కడ ఓడనెక్కవలయును — బండిహార్బరుఆవరణలో — బుక్కింగ్ హాలున కెదురుగానిలిచినది. ఆపరిసరమునదిరుగుచున్న కూలివాడొకడువచ్చి బండిలోనిసామానులనుదీసి నెత్తిమీదబెట్టుకొని—"బాబూ! ఎక్కడకు?"అని యడిగెను. బండివానికిగూడ తనప్రయాణము తెలియకుండ నుండవలయునని — ఆయువకుడు తలంచుటచేతకాబోలు వానికి మాఱుపలుకలేదు. అద్దెనిచ్చి బండివాడుబండినిమరల్చుకొని తనలోతా నాశ్చర్యపడుచు పోయినాడు. కూలివానినాగుమనిచెప్పి ఆయువకుడు— బుకింగ్ హాలులో నొకటికెట్టుకొనెను. దానిమీద — "యస్, యస్, సాలవీను" అను నక్షరములున్నవి. పలురకములగుడుస్తులనుధరించి

ఒయ్యారముగ నడచుచున్న స్త్రీపురుషు లనేకులు బుక్కింగ్ హాలులో నిటునటు నడయాడుచుండిరి. కూలివాండ్రుతొందరగా సామానులు మోయుచు పరుగిడుచుండిరి. మొత్తమువిూద "యస్. యస్. సాలవీను" అను సముద్రనౌక ప్రయాణమగుసమయము సమీపించుటచేత— హార్బరునుండి అక్కడకు దానికిచెందిన "బోటు-ట్రెయిను"నకు ప్రయాణికులుపోవుచు నెక్కుడుగా సందడిచేయుచున్నారు.

ఆతడు — టిక్కెట్టును జేబులో పదిలపఱచుకొని — సామానులను మోయుచున్న కూలివానితో — "బోటు-ట్రెయిను"న కని చెప్పినాడు.

* * * * * *

యస్. యస్. సాలవీను నౌకకు పై భాగముననున్న యొక హాలులో పేముకుర్చీమీద గూరుచుండి, గవాక్షముగుండా నొకపెద్ద మనుష్యుడు, అగాధములగు సముద్రజలములను బరికించుచుండెను — ఆతని పేరు "జగదీశబాబు!"

జగదీశబాబు — తా నప్పుడా నౌక పై భాగమున నంతలోనే ఉండుటకు కారణమేమని ఆలోచింపసాగెను — వానికి వెంటనే కారణ మవగతమయినది. బొంబాయి నగరములో తన మేడమీదిగదిలో మేజా బల్లపైన గనుపించిన ఆవింత యుత్తరమే ఇప్పుడు తా నాఓడమీదనుండు టకు కారణము. ఆఉత్తరము రెండుదినముల క్రిందట నాతని కంట బడినది. అది వానికి మిత్రుడయిన "గంగారామ్‌చెర్మక్" అను వాని చేత వ్రాయబడినది. అం దిట్లున్నది.

"నేను నీసహాయమును గోరుచున్నాను — జగదీశ్! అత్యావస రము — 8 వ తారీఖున హాకీమ్‌ఘాటునొద్ద సాలవీను నౌకలో నీవు నన్ను గలసికొనవలయును — నీకు పుణ్యముండును—మరచి పోవలదు — అశ్రద్ధచేయవలదు — నేను పైయంతస్థులో నీకొఱకు కనిపెట్టుకొని యుండెదను." ఉత్తరమునకు క్రింద గంగారామ్‌చెర్మక్ సంతకము

మాత్రమున్నది. అంతకంటె వేఱు విషయములేవియు నందు గనబడుట లేదు — ఆయుత్తరములో నొకటికెట్టుకూడ పంపబడినది. అటికెట్టు 'సాలవీను' మీద ప్రయాణము చేయుటకని ఆతడు గ్రహించెను.

సాలవీను నౌక మిక్కిలి పెద్దది. అదిఒక పెద్దగ్రామమంత యుండును. నాలుగంతస్తుల మహోన్నత సౌధమువలె నున్నది. నౌకా నిర్మాణమున నిపుణులగువారలచేత, కొన్నిలక్షల రూప్యములను వెచ్చించి, నిర్మింప బడినది- పాశ్చాత్యనౌకలకంటె నదిమిక్కిలి మనో హరముగనుండు ననుమాట అతిశయోక్తికాదు - అందు ప్రయాణికులు బసచేయుటకు కొన్ని వందల గదులున్నవి. వారు పాశ్చాత్య పద్ధతుల ననుసరించి, డ్యాన్సు చేయుటకుహాలు. లనేకములున్నవి. ప్లేగ్రౌండ్సు- టెన్నిస్‌కోర్టులు — అంగడులు — ఇవి యవి యననేల? సాధారణముగా ప్రయాణికులకు కావలసినవస్తువు లనేకములున్నవి.

సాలవీను బొంబాయిహార్బరునుండి శిలోనుపోవనున్నది. అది హాకీంఘూటుకడ ప్రయాణమారంభించును. సాధారణముగా విదేశములను జూడవలయునన్న ఉత్సాహమున్న స్త్రీపురుషులనేకులు సాలవీనులో ప్రయాణముసాగించుచుందురు. గంగారామ్‌చెర్మక్ యొద్దనుండివచ్చిన యుత్తరమునుజూచుకొని ఆతని నానౌకమీద దర్శించుటకు — జగదీశబా బందుండెను.

జగదీశబాబు — ఇంగ్లాడుదేశమునుండి తిరిగివచ్చి నాలుగుదినము లయినగాలేదు. ఆతడుసుమారు రెండుసంవత్సరములకుపూర్వము ప్రపం చమునంతయుజూచిరావలయునన్న తలంపుతో బయలుదేఱిపోయినాడు. అమెరికా — ఆఫ్రికా — ఆస్ట్రేలియా మున్నగుఖండములను దర్శించి, పిమ్మట యూరపునకుబోయి — యూరపుఖండములోని వివిధదేశములలో కొన్నినెలలుండి తుద కింగ్లాండు ప్రవేశించినాడు — ఆత డింగ్లాండులో నొకసంవత్సరము పూర్తిగావసించెను. ఆతనికి ధనమునకుకొదువలేదు;

కష్టపడిపనిచేసి, ధనముసంపాదింపవలయుననిలేదు — వానిపినతండ్రి మరణ కాలమందు సంవత్సరమున కిరువదివేలరూపాయిల రాబడివచ్చునాస్తిని వానిపేర వ్రాసినాడు. పైతృకమగుఆస్తి తనకుసంక్రమించుటచేత — తాను మంచినక్షత్రమునబుట్టితినని సంతోషించి — ఆతడు విదేశపర్యటనము నకుప్రారంభించెను — ఆపర్యటనము ముగియుటతోనే, తిరిగి హిందూ దేశముమీాద వానిమనసు వ్రాలినది. ఆతనికిజన్మభూమియగు బొంబాయి నగరమునకు తిరిగిరావలయునన్న యుద్దేశ్యముకలిగినది. ఆయుద్దేశముతోనే జగదీశబాబు — లండనువిడిచిపెట్టి నాలుగుదినములకుపూర్వము బొం బాయిహార్బరులో కాలుపెట్టెను. ఆత డింతలోనే మరల నోడనెక్కు అవసరముకలుగునని కలనయిన దలంపలేదు—

జగదీశబాబునకు గంగారామ్‌చెర్మక్ స్నేహితుడు — ఆతడు వానిని మూడుసంవత్సరములకుబూర్వము మాత్రమేచూచినాడు. పిమ్మ ట దాను విదేశములకేగుటచేత మరలవానినిజూడలేదు — కాని హిందూ దేశమునకుదిరిగివచ్చుచున్నానని తెలియజేయుచు గంగారామునకు జగ దీశుడు లివరుపూల్‌నుండి యుత్తరమువ్రాసినాడు. ఆఉత్తరములో బొంబాయినగరమందలి తనమేడను దెలియజేయుచు — తా నక్కడకు వచ్చుటనే తన్నుగలసికొనవలసినదిగా వానినిగోరినాడు.

గంగారామ్ జగదీశు లిరువురు బాల్యమునుండియుగూడ మంచి స్నేహితులు — వారిస్వభావములలోను — ప్రవర్తనములలోను — దృక్ప థములలోను — పరస్పరవిరుద్ధమున్నను, వారిహృదయములొక్కటే! గంగారామ్‌చెర్మక్ మిక్కిలి తెలివిగలవాడు. మొదటినుండియు చదువు నందు వానికాసక్తిమెండు; దానికితోడు గ్రహింపుశక్తి కూడనున్నది. జగదీశునకు చదువునం దంతగాశ్రద్ధలేదు. అందుచేతనే ఆతడుప్రవేశపరీక్ష తోనే చదువునకు స్వస్తిచెప్పినాడు కాని — వ్యాయామమం దాతని కభిలాషమపారము. పొట్లాటయన్నను, దేహబలమును వ్యక్తము

చేయు సర్కసుఫీసులన్నను, అతని కుత్సాహమధికము. అతడు మంచి బలశాలి.

ఈవిధముగా దృక్పథములలో నిరువురకు వ్యత్యాసమున్నను — ఇరువురు మంచి స్నేహితులు.

గంగారామ్‌చెర్మన్‌కు నొకచెల్లెలున్నది - ఆమె నొక్కపర్యాయము మాత్రము జగదీశుడు — తన విదేశయాత్రకు ముందు, సినిమా హాలులో చూచెను. ఆమె కప్పటికి పదునెనిమిది సంవత్సరముల వయస్సుండును—

"జగదీశ్! నీకు పుణ్యముండును — మరచి పోవలదు" అను మాట లాతని మెదడును సుడిగుండమట్లుచేసి, త్రిప్పుచున్నవి. అంత అవసరమేమి వచ్చినది? చెర్మనునకు కలిగిన అపాయమేమి? ఆతడు బొంబాయి నగరములో నెచ్చటనయిన, దన్ను గలసికొనవలసినదని వ్రాసినచో — జగదీశు డంత వ్యాకులమందకపోవును. ఈ నౌకలో నెందులకు గలసికొమ్మనెనని ఆత డాలోచించెను. ఆతని హృదయ సీమలో వివిధములగు సందేహములు వెలువడినవి. కాని, కారణ మాతనికి గ్రాహ్యమయినదికాదు; ఆక్లిష్టసమస్యను భేదించుటకు చెర్మన్ దర్శనము కావలయును. జగదీశుడు - తానుగూడ నితర ప్రయాణీకుల వలె బోటు _ ట్రెయినులో "గేట్ వే" యొద్ద బయలుదేరినచో, చెర్మన్ కంటబడియుండునని అనుకొనెను, కాని ఆత డట్లు చేయలేదు. తనయిల్లు హార్బరున కించుక దగ్గఱగా నుండుటచేత - అడ్డు దారులను బట్టి, కాలినడకతో వచ్చి -- నౌక నెక్కినాడు -- సాలవీను నౌక నెక్కిన ప్రయాణీకులలో నాతడే మొదటివాడు. వానికి ముం దెవ్వరు రాలేదు; వానికి తరువాతనే క్రమక్రమముగా ప్రయాణీకులందఱు వచ్చిరి. బోటు -- ట్రెయిను వచ్చుటకు వేళ అయినది. బాలభానుని కిరణజాలములు వినీలజలోపరిభాగముమీద పడుచు ప్రకృతికి వింత

పోయగమును గలిగించుచున్నవి. నౌకలో పనిచేయు సేవకులు --
"స్టీవర్డ్సు" సామానులను సర్దుచు తొందరగా నీప్రక్కనుండి,
ఆప్రక్కకు బోవుచుండిరి. జగదీశుఁడు వ్యాకులపాటుతో, సముద్రజల
ములమీదికి తన దృక్కులను ప్రసరించుచుండెను -- ఆతనికి ముప్పది
సంవత్సరముల వయస్సుండును -- శరీరము చామనచాయగలిగి మిక్కిలి
స్థూలముగనుండును. ఆతడు బాల్యమునుండియు బాగుగా వ్యాయామ
శిక్షను పొందినవా డగుటచేత, బలముగనుండెను. వాని కన్నులు
పెద్దవి కాకున్నను కాంతిమంతములే! మొత్తముమీద నాతడు సుంద
రుడు గాక పోవచ్చును, కాని వానిలో నాకర్షణశక్తికి కొదువలేదు.

జగదీశుఁడు, జేబులోని చుట్టను దీసి నోటఁ బెట్టుకొనెను.
ఆతని హృదయములో శాంతిలేదు - గంగారామ్ వ్రాసిన యుత్తర
మును మరచిపోవుటకు విశ్వప్రయత్నము లొనరించుచున్నాఁడు. అవి
ఫలింపలేదు. వానికి పదముల చప్పుడు వినబడినది. ఆత్రముతో ప్రక్కకు
తిరిగి చూచినాడు—

"అగ్గిపెట్టె ఇదిగో పుచ్చుకొనుఁడు"—అని పలుకుచు నొక
వంగదేశీయుఁడు వానిని సమీపించెను. ఆతడు యుక్తవయస్సులో
నున్నాడు. కాయము మిక్కిలి పలుచగ నున్నది. ఆతఁడు పొడగరి.
రెండు పెదవులతో సిగరెట్టును బట్టుకొని, అగ్గిపుల్లను వెలుగఁదీసి —
పిమ్మట నగ్గిపెట్టె నాతఁడు జగదీశున కందించెను.

"చిత్తము. కృతజ్ఞుడను" అని పలుకుచు జగదీశుడు చుట్టను
ముట్టించుకొని, మరల నగ్గిపెట్టె నావంగదేశీయుని కిచ్చెను. ఆతఁడు
దాని నందుకొని--సముద్రజలములను పరికించుచు ప్రక్కకు తిరిగి పోయి
నాడు. జగదీశుఁడు వానిని వెనుకనుండి చూచుచుండెను.

ఆసమయమున బోటు -- బ్రెయిర్ కూత వాని చెవుల బడినది.
గంగారామ్ చెర్మన్ అందుండుననియు, వాని నిప్పుడు చూడవచ్చు

ననియుననుకొని జగదీశుఁడు కుర్చీనుండి లేచి -- ఆత్రముతో నౌక యొక్క ఇనుప ఊచలను బట్టుకొని నిలువబడి చూచుచుండెను -- రైలింకను నౌక నిలిచియున్న హాకీం ఘాటునకు మైలు దూరములో నున్నది.

"మనమింక నెంతో సేపు, ఆగనక్కఱలేదు—" అనుమాటలు వానికి వినిపించినవి. ఆతడు వెనుకకు తిరిగిచూచెను. ఆకంఠము ముందు దనతో మాటలాడిన వంగదేశీయునిదికాదు - తా నున్నగదికి ప్రక్క నున్నగదిలో బసచేయుచున్న స్థూలకాయు డొకడు వచ్చినట్టు లాతడు గ్రహించెను. అక్రొత్తగావచ్చిన యాతడు వయసు మరలినవాడు -- నేత్రములలో వింత భావములు పొడసూపుచున్నవి. ఆతడు మాటి మాటికి కనుబొమ్మల నెగురవేయుచుండును -- వాని పెదవులమీద నొకవిధమగు మందహాసము గోచరించుచున్నది.

"మనమెప్పుడు బయలుదేరుదుము?" అని ఆతడుమరల జగదీశుని బ్రశ్నించెను.

అప్పుడే హాకీంఘాటులో -- సాలపీను నొక కంటికిపెట్టుకొనియున్న పెద్ద రేకులపెడ్డులో ప్రవేశించుచున్న బోటుట్రెయిను నాతురతతో జూచుచు, జగదీశుడు—

"మనము సరిగా ఒంటిగంటకు బయలుదేరుదుమని" ప్రత్యుత్తర మిచ్చినాడు.

"మన మొంటిగంటకు బయలుదేరుదుమా?" అని మెల్లగా నాస్థూలకాయుడు ప్రశ్నించెను; జగదీశుడు మాటాడలేదు. మరల స్థూలకాయుడే సంభాషణ కుపక్రమించెను.

"మన మిరువురము షిప్ మేట్సు మగుటచేత నాపరిచయమును మీకు కలుగచేయుట మంచిది. -- నన్ను "శరశ్చంద్ర ఘోసందురు."

"నాపేరు జగదీశుడు"

బోసు -- బోటుట్రెయిను వైపు చేయి చూపుచు -- "మీరొక స్నేహితునికొఱకు ఎదురు చూచుచున్నారను కొందును" అనెను.

"అగును" అనిజగదీశుడు తల యూచినాడు.

"మీరదృష్టవంతులు -- జగదీశబాబూ! నేను నౌకలో నెవ్వరి నెఱుగను--కాని త్వరలోనే మీ బోటుట్రెయినుతో పరిచయము కలుగకపోవునా?" అని బోసు చెప్పినాడు. అతని నేత్రములు తీవ్రముగా జగదీశుని పరికించుచున్నవి.

జగదీశుడు—తాను స్టేషనులోనికి వచ్చి నిలిచియున్న బోటు-ట్రెయినును తదేకధ్యానముతో చూచుచున్నాడు. బోసు—తన అంగీ జేబునుండి ఒక సన్నని సిగరెట్టును బయటకు దీసి, కాల్చుట కారంభించెను. జగదీశునకట్టి సిగరెట్లను గాల్చు మనుష్యులన్న అసహ్యము; అతని నక్కడ విడిచిపెట్టి వేఱొక చోటునకు పోయిన బాగుండునని ఆత డనుకొనెను. కాని మర్యాదను దప్పి ప్రవర్తింపరాదు కదా!

"మనము పనిచేయుచున్న గదులు రెండును—ఒకదాని ప్రక్క నొకటున్నదని నే ననుకొనుచున్నాను; జగదీశబాబూ! నాగది పదిహేన వది; మీరు పదమూడవ గదినుండి బయటకు వచ్చుచుండుట చూచి తిని." అని బోసు మెల్లగా పలికెను.

"అగున"ని జగదీశుడు మాఱు పలికెను.

"అయిన యెడల — మీరు ఛాందసులు కారను కొందును."

"అదృష్టవశాత్తు నేను ఛాందసుడనుగాను. నాకు పిచ్చి నమ్మకములు లేవు—" అని జగదీశుఁ డనెను.

"ఆ బేసిసంఖ్య గదిలో మీతోగూడ వసించుటకు వచ్చుచున్న మీ స్నేహితుడు గూడ మీవంటి పెద్దమనుష్యుఁడే అయియుండవల యును. ఆయనకు గూడ అంధవిశ్వాసములు లేకపోవచ్చును."

"లేకుండుటయే నాకోరిక—ఏగది యయిననేమి? ఎన్నవ నెంబరయిననేమి?"

"అగును — ఎన్నవ నెంబరయిన నేమిలేదు."

జగదీశునకు విస్తారము బోసుతో సంభాషించుటకు కిష్టములేదు. ఆతని ధోరణియే వాని కసహ్యమును గలిగించినది. త్వరగా నేదో సాకు చెప్పి, ఆతనినాలాగునుండి రెండవ అంతస్తునకు పోయి — బోటు — రైలునుండి వచ్చుచున్న ప్రయాణీకుల నాసక్తితో చూచుచున్నాడు.

బోటును నిలిచిన హాలు జనముతో నిండిన వారలనేకులు, క్రిక్కిరిసియుండిరి. వారిలో ముందుగా వచ్చుచున్న వారు నౌకయొక్క మొదటి అంతస్తున కొకరి నొకరు త్రోసికొనుచు వచ్చుచుండిరి. కాని పైన నిలువబడి చూచుచున్న జగదీశబాబునకు ప్రయాణీకుల తలపాగాలు — టోపీలు తప్ప ముఖములు కనుపించుటలేదు. గంగారామ్ చర్మకార్ ఆ జనసమూహములో నున్నాడనియే ఆతని తలంపు. ఆతడు నౌకయొక్క పైభాగమునకు తప్పుంగల వారితో బోటుదిగునప్పుడు తప్పక తన కంట బడునని ఆతడు నమ్ముచున్నాడు. గంగారాముని జూచి మూడు సంవత్సరములు రమారమికావచ్చినను — ఆమూడు సంవత్సరములలో నాతనిలో ననేకములయిన మార్పులు కలిగినను — దా నాతనిని సులభముగా గుఱుతుపట్టగలనని జగదీశుఁ డనుకొనుచుండెను. ఆతఁడు రెప్ప వ్రాల్పకుండ దీక్షతో ప్రయాణీకులను బరికించినాడు. కాని వానికి స్నేహితుని జాడ కనబడలేదు.

ఇక రెండవ అంతస్తుమీద దానున్న లాభములేదనియు — క్రిందకుదిగి "స్మోకింగ్ రూము"లో కనుక్కొని యుండిన యెడల గంగారాముని సుళువుగా కలసికొనవచ్చుననియు దలంచి - జగదీశుడు వడిగా నెలక్ట్రిక్ లిఫ్టుద్వారా మొదటి యంతస్తునందున్న స్మోకింగ్

రూములో ప్రవేశించెను. రేవుల షెడ్డులోని ప్రయాణికులు — ఓడ యొక్క లోపలిభాగమునకు వచ్చిన వెనుక — స్మోకింగురూమును దాటి ఇతర ప్రదేశములకు పోవలయును. అందుచేత నాత డక్కడ తన మిత్రుని జూడవచ్చునని భ్రమించెను. కాని స్మోకింగ్ రూములో నొక్క ప్రయాణికుఁడు తప్ప ఇతరు లెవ్వరు లేరు - అతడు తొలుత జగదీశున కగ్గిపెట్టె నిచ్చిన వంగదేశీయుడు!

జగదీశ్‌బాబు — ఆత్రముతో నోడయొక్క సింహద్వారము నొద్దకు పోవలయునని ప్రయత్నించెను. కాని అతడు సాలవీను నౌక నారోహించుట కిదియే మొదటిపర్యాయము. అందుచేతనా యోడను గూర్చి అతడంతగా నెఱుగడు; అతనికి ఒక "స్టివర్డు"యైన గంట బడ లేదు. ఏమిచేయుటకును దోచక, జగదీశుడు మరల మూడవఅంతస్తు మీదికిపోయినాడు. అప్పటికి స్టివర్డులు ప్రయాణికుల సామానులను దెచ్చి — వారి వారి గదులలో వదల పెట్టుచుండిరి. మఱికొందఱు వారికి గదులలోనికి మార్గములను జూపుచుండిరి. అతని కితర ప్రయాణికు లెందఱో కంటబడిరి. కాని — తానాత్రముతో వెదకుచున్న యువకు డగపడలేదు.

జగదీశ్!......నీకుపుణ్యముండును — మరచిపోకుము — అన్న ఉత్తరములోని మాటలు వానికి మరల జ్ఞప్తికి వచ్చినవి కాని గంగారా మింకను గనబడలేదు. తుదకాతనికొక అనుమానముతోచినది; గంగారా మంతకుముందే పదుమూడవ నెంబరుగదిలో ప్రవేశించి యుండవచ్చును. ఆ జనసమూహములో తాను వానిని గుఱుతించి యుండక పోవచ్చును — అగును; అందులకు సందేహములేదు. — ఇట్లు భావించి జగదీశుడు వడిగా తాను బసచేసిన గదివంకకు నడువసాగెను. ఆసమయమున నాతనికి స్టివర్డెదురుపడెను. ఆస్టివర్డు స్థూలకాయుడు — వానికి శరీరమెంత పెద్దదో — తల అంతచిన్నది. ఒడలిచాయ జీడి

పిక్కను తెలు పనిపించును. జగదీశుడు వానిని మొదటినుండియు సేవ గించుకొను చుండెను.

"పదుమూడవ నెంబరు గదిలో నాతో భోజనము చేయ గోరిన గంగారామ్‌చెర్మకర్ గారు — అందు ప్రవేశించుట నీవు చూచితివా?" అని ఆతడు స్త్రీవర్తిను ప్రశ్నించెను.

"చిత్తము వారొక్క క్షణమునకు ముందా గదిలో ప్రవేశించిరి"

ఆప్రత్యుత్తర మొసగి స్త్రీవర్తి త్వరత్వరగా తన పనిమీద పోయెను. జగదీశుడు సంతోషముతో తన గది కడకు నేగినాడు. ఆతడు గది తలుపును లోనికి త్రోసి తెరచి, అందు ప్రవేశించెను.

ఆ గదిలో—గుమ్మము వైపు వీపునుంచి — గోడకానుకొని యొకవ్యక్తి నిలువబడియుండెను. కింగ్సు హోటలు యజమానుడగు స రమేంద్రదత్తు నక్కడకు తీసికొనివచ్చినదో—ఆవ్యక్తి నాతడు సులభముగా గుఱుతుపట్టగలడు. ఆవ్యక్తియే వాని రిజిష్టరులో "ఏ. చంద్ర" అని సంతకమును జేసినాడు; కాని ఆవ్యక్తి జగదీశునకు స్నేహితుడు— గంగారామ్‌చెర్మకర్! ఆతని సాలపీర్ నొక్కి సత్వావసరముగా వచ్చి కలసికొమ్మని ఉత్తరము మూలముగా కోరినవాడితడు!

గంగారామ్ చెర్మకర్ — ఉడు తెలుంగక — త్రాగిన వానివలె గోడనుండి క్రిందకు జారుచుండెను.

"చెర్మకర్!" అని బిగ్గరగా నుత్సాహముతో పిలుచుచు, జగదీశుడు వాని యెదుటకు బోయి నిలువబడెను. హఠాత్తుగా నాతని ఉత్సాహమంతరించినది. దాని స్థానమున విస్మయము బయలు దేఱినది. గంగారాముని ఆకృతి వానికి వింతగా తోచినది—జగదీశుడు తల వని తలంపుగా త్రుళ్ళిపడెను.

ఆత డాశ్చర్యముతో మెల్లగా, గంగారాముని భుజముమీద చేతితో తట్టెను. ఆసమయమున నాతనికి కట్టెదుట నెర్రని అక్షరములు నాలుగు కంటబడినవి___

"ఎల్లో తేలు"

ఆ అక్షరము లెర్రగానున్నవి — ఇంకను తడిగనేయుండుటచేత నవి అప్పుడే వ్రాయబడిన వనుట నిక్కువము. జగదీశుడు — ఆశ్చర్య చకితుడాయెను; ఆతని చేయి, అప్రయత్నముగా గంగారాముని భుజ మును బట్టుకొని ఊగించినది.

అప్పుడు — గంగారామ్ చెర్మక్ — (జి. చెంగ్లా) యొక్క మృత కళేబరము గోడనుండి క్రమక్రమముగా క్రిందకు జాఱి జగదీశుని పాద ముల సన్నిధిని బడినది!

---

## రెండవ ప్రకరణము.

---

జగదీశునకు పండ్లు దిట్టకట్టుకొని పోయినవి. ఆతని నోటినుండి మాట వెలువడలేదు. తెల్లబోయి, ఆతడు క్రిందకు చూచుచు నిలువ బడెను. వాని నోటిలోని చుట్ట అట్లేయున్నది.

ఆతఁడా చుట్టను దీసి పాఱవేసి — క్రింద కూలబడెను. ఆతడు మరల లేచి చూచుసరికి వానిచేతులకు రక్తమంటుకొన్నది.

"ఓయి భగవంతుడా!" అనుచు నాతడు తనపాదములచెంత నొకకత్తిని జూచెను.

"ఆత్మ హత్యయా?" అని ఆతడు తొలుత తనలో తాను ప్రశ్నించుకొనెను. కాదు — ఆత్మహత్య కాదు. ఆతడు గంగారాముని

బాగుగా నెఱుగును; వాని స్వభావ మాత్మహత్యకు, ప్రేరేపింపదని ఆతడు దృఢముగా విశ్వసించెను.

హత్య! దారుణమగు హత్య! గంగారాముని మెడ — ఈచెవి నుండి ఆచెవివఱకు క్రిందబడియున్న [illegible]తో నఱుకబడినది. అందులకు సందేహము లేదు?

జగదీశునకు గోడమీద వ్రాయబడిన పేరు మరల నొకసా[illegible]యము దృక్పథమున నిలిచినది. అది రక్తముచేత వ్రాయబడినది. "నాశక్తిని నీవెఱుగుదువు? నారహస్యము నెవరికి చెప్పగలవు?" అను ప్రశ్నలతో దన్ను పరిహాసించుచున్నట్లు—

"ఎఱ్ఱతేలు"—

అను పేరు వానికి గన్పట్టుచున్నది. జగదీశుడు క్షణమాత్రము తీవ్రముగా నాలోచించినాడు. ఆ పేరు గంగారామునిచేతనే వ్రాయబడినదని ఆతడు తలంచెను. పాపము! ఆనిర్భాగ్యుడే తన్ను హత్య గావించిన వానిని లోకమెఱుంగుట కామాత్ర మవకాశమును గల్పించినాడు—ఆ అక్షరముల నాతడు — తన రక్తముతో — అవసానకాల మందు ఎదుటనున్న గోడమీద వ్రాసినాడు. కాని లాభమేమి? జగదీశునకు గ్రాహ్యము కాలేదు. వాని కన్నులా భయంకరదృశ్యమునకు పచ్చబడినవి; మెదడు సుడిగుండమువలె నయినది. భావములు చెదరి పోయినవి. ప్రశాంతమగు మనస్సుతో నేవిషయమును గుఱించియైనను నాలోచించుట కప్పట్లు వానికి శక్తి చాలదు— ఎఱ్ఱతేలనగా నర్థమేమో!— ఆ ఎఱ్ఱతేలే హంతకుడై యుండునో! హంతకు నన్వేషించుటకా 'ఎఱ్ఱ తేల'ను పేరెంతవఱకు సహాయపడునో — జగదీశునకు బోధపడలేదు. ఆతడీవిధముగా జరుగునని కలనయినను ననుకొని యుండలేదు!

జగదీశుడు మెల్లగా తలుపును మూసి — ఈవలకు — హాలు లోనికి వచ్చినాడు. వానికి దూరమున నిలువబడి ఆవంగదేశీయుడు తదేకదృష్టితో నాగదిని దిలకించుచుండెను.

"ఏమి జరిగినది? ప్రమాదమేదయిన వాటిల్లెనా?" అను ప్రశ్న మాతని నోటినుండి వెలువడినది.

"అవును _ హత్య!" అని జగదీశుడు మాఱువలికెను. హఠాత్తుగా నావంగదేశుని ముఖలక్షణములు మాఱిపోయినవి. ఆతని కన్నులలో నుద్రేకము పొడసూపినది — ముఖ మెఱ్ఱబారినది. జగదీశుడు వానిని గనిపెట్టుచునేయుండెను — ఆతని మెదడులో నొక అనుమానము కలిగినది — ఆయువకుడు తన స్నేహితుని హత్యను గుఱించి ఎఱుగునా యని ఆత డనుకొనెను.

"అగును — హత్య!" అని గట్టిగా మరల జగదీశుడు పలికెను. "అక్కడ హత్యయా?" అని వంగదేశీయుడు తన దృక్కులను గదివంకకు ప్రసరించినాడు — జగదీశుడు తల నూంకించెను. తోడనే, ఆతడు వడిగా గది యొద్దకు నడువసాగెను — కాని జగదీశుడు మిన్నకుండ లేడు. వానికంటె ముందుగా తాను గది యొద్దకు బోయి — తలుపున కడ్డుగా నిలువబడినాడు — వంగదేశీయునకు లోనకు ప్రవేశించుట కవకాశము కలుగలేదు.

"అయ్యా! మీరు లోనికి వెళ్ళరాదు—" అని మోమోటము లేకుండ జగదీశుడు పలికెను. అప్పుడు వంగదేశీయుడు, చేయునది లేక మెల్లగా వెనుకకు తగ్గినాడు.

ఆహాలునకు దూరమున ప్రయాణికు లనేకులు గుంపుగూడి యుండిరి. స్త్రీవర్గులు కొంతమంది, వారిని గదులలోనికి పంపుచుండిరి. మృతకళేబరమున్న గదికి జగదీశుడు తాళమును వేసినాడు — పిమ్మట ఆతాళమును పదిలముగా తన జేబులో దాచుకొని, ఆసమయమున

గదులలో ప్రవేశించుచున్న యిరువురు స్త్రీలను, ఒకయువకుని ఆతడు చూచుచుండెను.

"అయ్యా!—నాకు చెప్పుడు—" అని ఆవంగదేశీయుడు జగదీశుని భుజమును బట్టుకొని, కనిపినాడు — జగదీశునకు మరల నను మానము కలిగినది. గంగారామ్‌చెర్మక్ యొక్క దారుణహత్యతో నాతని కొక విధమగు సంబంధమున్నదా యని, ఆతడు తనలో నను కొనెను.

"మీాస్నేహితుడా?" అని ఆవంగదేశీయు డాతని నుద్దేశించి ప్రశ్నించెను — జగదీశుడు తల నాడించెను.

"హత్య కావింపబడెనా! ఆపని నెవరు చేసిరో మీారేమియు నెఱుంగరా?"

"నాకేమియు తెలియదు — నే నేమియు నెఱుగను, మీారీవిషయమై నోరెత్తవద్దు—"

"అలాగుననే — పర్సరునకు మీా రీరహస్యమును జెప్పవలసి యుండు నను కొందును."

జగదీశుడు తలయూచెను.

"అటులయిన నే నిక్కడుండెదను — ఆగదిలో నెవ్వరును బ్రవేశింపకుండజూచెదను—ఆతలు పితరులు తీయకుండుటయే మంచిది."

"అవును — తీయరాదు —" అని పలుకుచు జగదీశుడు మరలనొకపరి గది తాళమును బరిశీలించి, పిమ్మట నాత్రముతో — పర్సర్సు ఆఫీసు వైపునకు నడచిపోయెను. వంగదేశీయుడు — ఆతడు హాలునుదాటి పోవువఱకు వెనుకనుండి వానిని గనిపెట్టుచునే యుండెను. ఆతని దృక్పథమున జగదీశుడు పడుటలేదు —

నాలుగవ అంతస్తుమీాద సంతోషకరమగు డ్యాన్సు ట్యూను వాయించుచున్న ఆర్కెస్ట్రాగానము వానిచెవుల బడుచున్నది.

పలుచగను పొడవుగనుఉన్న ఆ వంగదేశీయు డొక పర్యాయము కుడి యెడమలకు తనదృష్టిని సారించెను. ఆ క్షణమున హాలులో నెవ్వరులేరు — నౌకయొక్క ఇతర భాగములందు జనులు క్రిక్కిరిసియున్నను స్త్రీవర్గులు సామానులనెత్తి పడవేయుచు పెద్దచప్పుడు గావించుచున్నను— హాలులో మాత్రమొక పిట్టయయినలేదు — ఆతడు గంగారాముని మృత కళేబరము పడియున్నగదిని సమీపించినాడు. పిమ్మట తన అంగీ జేబులోనున్న తాళపుగుత్తిని బయటకుదీసి — తానీవలకే యస్. యస్. సాలవీను నౌకయొక్క పదుమూడవనెంబరు స్టేటురూము తలుపునకే తాళపుచెవి పనికివచ్చునో, ఎటిగినట్లొక తాళపుచెవిని కప్పలోదూర్చి- చిటికెలో తలుపును దీసినాడు — ఆతడు మెల్లగా లోన ప్రవేశించి, తన వెనుకతలుపును మూసికొనెను.

సరిగా అఱువదిసెకండ్ల కాలమయినగాలేదు. ఆతడు గదినుండి బయటకువచ్చి, మరల నెప్పటియట్ల తలుపునుమూసి తాళమును బిగించినాడు — "గంగారామ్‌చెర్మక్ గతించిపోయెను! —— పాపము! ఈఓడ మీాద నాతడు పదినిముషముల వఱకయిన జీవములతో నుండలేదు — అంతలోనే ఎర్రతేలు వానింగడతేర్చినది!— " అని ఆతడు తనలో తానే సణుగుకొనెను.

* * * * *

సాలవీను నౌకాధిపతి—డాక్టరు పరీక్షించుచున్న మృతకళేబరమును తెల్లబోయి చూచుచుండెను. ఆతని కన్నులలో నాత్రము స్పష్టపడుచున్నది. పదుమూడవనెంబరు గదిలో నమకూడిన విషాదాంతగాథ—డాక్టరు, మృతుడయినయువకు డాత్మహత్య గావించికొని యుండుననుట తన యభిప్రాయమని చెప్పినను—రక్షక భటాధికారుల చేత హత్యగా భావింపబడినచో—తన ఓడ కొంతవఱకు ప్రయాణమాలస్యముగా చేయవలయునని ఆతడు భయపడుచుండెను.

పదుమూడవగదిలో మృతకళేబరమును ఆశ్చర్యముతోను - ఆత్రముతోను పరికించుచు, డాక్టరు నోటినుండి వెలువడుమాటకొఱ కెదురుసూచుచున్న వారిలో నిరువురు రక్షకభటాధికారులుండిరి— ఒకమనుష్యుడు—పర్సర్ ఒకడు నౌకాధిపతి.

ఆవ్యక్తులలో కెల్ల నౌకాధిపతియే చూపఱుల దృక్కులను ద్వారి తగతి నాకర్షింపగలడు. అతని ముఖము సముద్రవాయువునకు పాలి పోయియున్నది—నేత్రములు వానికి సముద్రయానమందుగల చిరకాలా నుభవమును సూచించుచున్నవి. అతడు మిక్కిలి పొట్టివాడయ్యు— ఠీవిగలవాడు!

ఆగదిలోగూడిన వారందఱు మౌనముతో — రెప్పవేయకుండ నామృతకళేబరమును దిలకించుచుండిరి.

"ఏమి! పర్యవసానమేమి!" అని నౌకాధిపతి మోహనమెహతా డాక్టరును బ్రశ్నించెను.

రక్షకభటాధికారులకు జెందినడాక్టరు, తన పరీక్షను ముగించి నాడు.

"ఆత్మహత్య! అందులకు సందేహములేదు — కత్తి, ఒకప్రక్క నుండి వేఱొకప్రక్కకు లాగఁబడియుండుటవలన నే నట్లు దృఢిగా తలంచుచున్నాను - ప్రాయశః శవమును గోసినపిమ్మట కూడ — అట్లు తేలునని నేను చెప్పగలను." అను మాటలు డాక్టరు నోటినుండి వెలువడినవి. వాని నాలకించుటతోనే — మోహనమెహతా బ్రతుకు జీవుడా! అనునట్లు నిట్టూర్పువిడిచెను. పర్సరుయొక్క ముఖలక్షణములు— వాని యధికారిముఖలక్షణముల ననుసరించియేయున్నవి.

"అటులయినచో— అయ్యా! కెప్టెన్‌గారూ! మీరోడ ఆగవలసిన అవసరములేదు; ఓడకు క్రిందనున్న వైద్యాలయసేవకులువచ్చి యిక్కడ నుండి ఈమృతకళేబరమును దీసికొనిపోవుదురు. దయచేసి మీరు నాకు

వాంగ్మూలమొకటి యిప్పింపుడు — అయ్యా! డాక్టరుగారూ! మీనుండి కూడ నాకు వాంగ్మూల మవసరము—" అని రక్షకభటాధికారులలో నొకడనెను — డాక్టరు తలయూచెను — ఆరక్షకభటాధికారి మరల నౌకాధిపతి నుద్దేశించి—"ఒకవేళ ముందుముం దేవయిన నితర గందర గోళములు రాకుండ — ఆగది తలుపును మూసియుంచుడని మిమ్ములను నేను కోరుచున్నాను. ప్రయాణము ముగియు వఱకు నట్లు చేయుటకు మీకభ్యంతరముండదు గదా?" అని అడిగెను.

"అభ్యంతరమేదియు లేదు — నే నీవఱకే, ఈగదిలో బసచేయ వలసిన పెద్దమనుష్యుని — జగదీశబాబును — వేఱొక గదికి మార్చి తిని — ఆతడు —— ——" అని పర్సరు — ఏదియో చెప్పబోవుచుండ గనే — రక్షకభటాధికారి వాని మాటకడ్డుతగిలెను.

"ఓహో! అగును — నే నాతని నొకపరిచూడవలసియున్నది — ఆతనినుండి కూడ స్టేటుమెంటు తీసికొనవలయును -" అనుచు నాతడు పర్సరు నవలోకించి మరల నిట్లడిగెను—

"మీ రెఱిగినంతవఱకు — ఇప్పుడు మృతుఁడయిన యీతని కీయోడమీఁద బంధుగులుగాని, స్నేహితులుగాని — ఎవ్వరు లేరన్న మాట?"

"లేరు—"అని పర్సరు ప్రత్యుత్తరమిచ్చెను. అట్లు చెప్పుటలో పర్సరు అబద్ధమాడలేదు—జగదీశుడు తాను గాంచిన శవమును గుఱించి, వాని కెఱిగించినప్పుడు—తనకును మృతుడయిన గంగారామ్‌చెర్మను నకును సంబంధమున్నదని గాని, స్నేహమున్నదనిగాని ఎఱిగింపలేదు — ఆవిషయమై ఆతడు మౌనము వహించుటకు కొన్ని కారణములున్నవి.

రక్షకభటాధికారుల దృష్టి ఒకపర్యాయము గోడమీద వ్రాయ బడిన "ఎర్రితేలు" అను దాని మీదబడినది. అది చనిపోయిన వాని రక్తముతో వ్రాయబడినదని వారు గ్రహించి, ఆశ్చర్యపడసాగిరి.

"ఎఱ్ఱతేలు!—చాల చిత్రముగనున్నది. ప్రాయశః మరణము నకు ముందీతనికి మతిభ్రమణము కలిగియుండవచ్చును—అగును. ఈతనికేకాదు; ఆత్మహత్యకు బాల్పడువారి కందఱకు మతిభ్రమణమే సంభవించును." అను మాట లాయిరువురిలో నొకని నోటినుండి వెలువడినవి—

ఆమాటలకు నౌకాధిపతి — మోహనమెహతా — వేఱు వ్యాఖ్యానములు సేయక, మౌనముతో తలనూంకించినాడు; కాని అతనికి మెదడులో పరస్పర విరుద్ధములగు భావము లనేకములు పొడసూపు చున్నవి. గంగారామ్‌చెర్మకార్—తన శిరశమునుండి స్రవించిన రక్తములో వ్రేలుముంచి స్వయముగా గోడమీద—'ఎర్రితేలు' అను నక్షరముల నెందులకు వ్రాయవలయును?—అత డాత్మహత్యనే గావించుకొని యున్నచో నటు లెందులకు వ్రాసియుండును? దారుణమగు తన మరణ మును గుఱించి లోక మెఱుంగుట కాతడేదో "క్లూ" విడిచినాడు— అని ఆతడు తనలో తా ననుకొనెను—

కాని, రక్షకభటాధికారులకు మెహతా తన అభిప్రాయ మెఱిగింప దలచుకొనలేదు — హత్యారహస్యమును భేదించు కార్యము వారిది. నౌకను ప్రయాణము సాగించు కార్య మాతనిది — సాధ్యమయి నంత త్వరలో నాలస్యము చేయకుండ, సాలపీను బయలు దేరవలయును— ఆహత్యను గుఱించిన గందరగోళ మెవ్వరికని దెలియరాదు - నిజము నకు మెహతాకు - గంగారాముని మృతకళేబరమును బరిశీలింపవచ్చిన ఆయిరువురి రక్షకభటుల యెడల నంత గౌరవములేదు - వారు విశేష ప్రజ్ఞకలవారు కారని ఆతడు కనిపెట్టెను. కాని ఆతడు నోరు విప్పలేదు. మెహతా అభిప్రాయముతో నేకీభవించిన యువకు డొక్కడు మాత్రమా ఓడమీదనుండెను—ఆతడు జగదీశుడు,

సాలవీను హార్బరును విడిచి—మెల్లగా కదలిపోవుచున్నది. దాని ప్రక్కకొసియున్న వందలకొలదియున్న చిన్న పడవలు తల్లితోనున్న పిల్లలవలె నగాధసముద్రజలములమీద ప్రయాణమును సాగించుచున్నవి.

జగదీశబాబు — మూడవఅంతస్తులో — హాలునందుగల ఒక కుర్చీప్రక్క నిలువబడి ఇనుపయూచల నానుకొనియుండెను. ఆతనికి చుట్టకాల్చుట యందభిలాష మెండు. పాశ్చాత్య దేశస్థులవలె నాతడు చుట్టను — పైపులో పెట్టి కాల్చుచుండును. ఆతడు మెల్లమెల్లగా పొగను ప్రక్కకు వుస్తించుచుండెను. ఆతని హృదయములో ప్రశాంతత లేదు. ఆలోచనలపైని ఆలోచనలు — సందేహములమీద సందేహములు వానికి దోచుచున్నవి.

"ఆత్మహత్య!" అను మాట అప్రయత్నముగా వాని నోటి నుండి వెలువడినది. నౌక యొక్క ఉపరిభాగములోనున్న ప్రయాణికులతోబాటు — ఆతడును, గంగారాముని మృతకళేబరమును ముసుగుతో "మోటారు — అంబ్యులన్సు" యొద్దకు గొని పోబడుటచూచినాడు. ఆముసుగులోనున్నది శవమన్న రహస్యము నాతడును, గొలది మంది మాత్రమే యెఱుగుదురు — ప్రయాణికులలో చాలమందికి — ఆకస్మికముగా నొక మనుజుడు జబ్బుచేసి, స్పృహదప్పి పడిపోవుట చేతనే, సాలవీను బయలుదేరుట కించుకసేపు ఆలస్యమయినదన్న విషయము తెలిసినది - కాని పదుమూడవ నెంబరు గదిలో దారుణము — ఆశ్చర్యకరము -- ఆభీలమునగు హత్య యని యెవ్వరును వినలేదు.

"కాదు -- ఆత్మహత్యకాదు—" అని జగదీశుడు మరల తనలో దాను తర్కించుకొనుచు పలికెను. పోలీసు — సర్జను లిరువురు స్పష్టముగా ఆత్మహత్యయని చెప్పినను, జగదీశునకు నమ్మకము కుదుర లేదు — ఆతడు, గంగారాముని బాల్యమునుండియు నెఱుగును — ఎట్టి విషమసంకటము సంప్రాప్తమయినను, గంగారామ్ స్వయముగా, తన

చేతులలో, తన సమాధిని త్రవ్వకోడని దృఢముగా విశ్వసించియుండెను. విశేషించి — గోడమీద మరణకాలమందాతనిచేత వ్రాయబడిన పేరే ప్రబలసాక్ష్యము హత్య—!

సందేహములేదు — గంగారామ్‌చెర్మన్ దారుణముగా హత్య చేయబడెను. జగదీశు డట్లు తలంచుటచేతనే — ఆరహస్యమును భేదించుటకు నోడమీదనే యుండవలయునని ఆతఁడు నిశ్చయించుకొనెను. ఆతని నిశ్చయమును మాటిమాటికి — 'ఎఱ్ఱతేల'ను మాట బలపఱచుచున్నది. బహుశః గంగారాముని హత్యగావించి దుర్మార్గు డాయోడమీదనేయున్నాడని జగదీశుడు తలంచెను.

"ఆహా! జగదీశబాబూ! చివఱకు మనము బయలుదేరితిమన్నమాట!" అనుచు స్థూలకాయుడు — బోసు నోటిలో సెంటెడ్ సిగరెట్టుతో నాతని ముందు ప్రత్యక్షమాయెను.

జగదీశుడు మాఱుపలుకలేదు; తలయూచెను.

"పాప మెవ్వడో నిర్భాగ్యుడు — ఆకస్మికముగా జబ్బుచేయుటవలన స్పృహదప్పినాడట — అందుచేతనే — ఈఆలస్యము; స్టీవర్డు నాకు చెప్పినాడు —" అని బోసు మరల నుడివెను.

"ఆలాగునా?" అని జగదీశు డాశ్చర్య మభినయించుచు ప్రశ్నించెను.

"అన్నట్లు — జగదీశబాబూ! —— —— —— మీస్నేహితుఁడు —— —— —— ——" అని బోసింకను పూర్తిగా ప్రశ్నింపకముందే, జగదీశుడు——

"ఆత డీఓడలో లేడు —" అని మెల్లగా మాఱుపలికెను.

సాలవీను కొంచెమువడిగా పోవుచున్నది — దానిరెండవ అంతస్తునందున్న ఆర్కెస్ట్రా హాయిగాపాడుచున్నది; సముద్రజలముల

మీదినుండి వచ్చుచున్న చల్లనిగాలితోబాటు — ఉప్పుకూడ జగ
దీశుని నాసికకు దగులుచున్నది.

"అతడీ యోడలోలేడా? పాపము! బోటు - ట్రెయిన్ దాటి
పోయియుండును — ఆతని కదృష్టములేదు —" అని పలుకుచు
బోసు — జాగరూకతతో జగదీశుని ముఖలక్షణములను బరికించు
చుండెను — ఆతడంతటితో మిన్నకుండలేదు. "జగదీశబాబూ! నేను
చెప్పలేదా? పదుమూడవనెంబరు గల గది అంతమంచిదికాదు —
మీకుగాకపోయిన, మీస్నేహితుని కయిననది కష్టకారణమై యుండె
డిదే!"

జగదీశుడు, విస్మయముతో — ఆపలుకులను ముగించి, ప్రక్క
కుపోవుచున్న బోసును బరికించెను — నిజమునకు గంగారాముని హత్య
నుగుఱించి, ఈతడేమియునెఱుగడా? అనుప్రశ్న వానిలో నుదయించినది.
ఆతనికి మొదట — వంగదేశస్థునిమీదను — తరువాత, బోసుమీదను
సందేహము కలిగినది. కాని ఇదమిద్ధమని నిర్ణయించుట కవకాశములేదు—
సందుదొరకలేదు.

ఆతడు హృదయభారముతో హాలును విడిచిపెట్టి — ప్రయా
ణికులందఱు కలసి ఇష్టాగోష్ఠి సలుపుచున్న వేఱొకగదియొద్దకు పోవు
చున్నాడు — గంగారాముని హత్య మరచిపోవుదమన్నను, ఆతనికి
మరపు వచ్చుటలేదు —

"జగదీశ్! నీకు పుణ్యముండును — మరచిపోకుము —" అను
వానియుత్తరమునందలి మాటలనాతడు మరల జ్ఞప్తికిదెచ్చుకొనెను —
నిస్సందేహముగా గంగారా మపాయమును శంకించినాడు - శంకించుట
చేతనే — ఆవిధముగా తనకుత్తరమును వ్రాసినాడు - ఇంతకు నీయోడ
మీదనన్నేల గలసికొమ్మని వ్రాయవలయును? ఇక్కడెందులకు హత్య
కావింపబడవలయును? నేనువానియింటికిపోయి — ఉత్తరము వచ్చిన

వెనుక — వానిని గుఱించి ప్రశ్నించితిని — అతడప్పుడే రెండువారము లకు పూర్వమే ఇల్లును విడిచి వెళ్లెననియు నెక్కడకు వెళ్లుచున్నదియు తమకు చెప్పలేదనియు నింటిలోనివారు బదులుచెప్పిరి. కనుక గంగా రాముని హత్యతో నీయోడకు సంబంధమున్నది — హంతుకు డీక్షణ మందుగూడ నోడమీదనేయున్నాడు — " అని అతడు తనలో నను కొనెను.

"ఎఱ్ఱతేలు!"

ఆపేరు వాని కాశ్చర్యమును గలిగించుచున్నది—హత్యకును— ఎఱ్ఱతేలునకు దృఢమగు సంబంధమేదియో యున్నదని జగదీశుని నమ్మకము—

"చివఱకు పోలీసువారు—ఆత్మహత్యయని నిర్ణయించిరా!" అనుమాటలు హఠాత్తుగా నాతని చెవిలోబడినవి. అతడింతవఱకును దనకొక గజముదూరమున నిలువబడియున్న వంగదేశీయునిజూడనేలేదు. ఆ వంగదేశీయుడు జగదీశుని దగ్గఱకువచ్చి, ఇతరులెవ్వరు వినకుండ నారీతిని బ్రశ్నించినాడు. ఆప్రశ్న — జగదీశుని హృదయములో నది వఱకుగల భావములకు మార్పుగలిగించినది. వానిసందేహమిప్పుడు యదార్థమైనది — వంగదేశీయుఁడు నిజముగా నాహత్యను గుఱించి యెఱుగునని అతడిప్పుడు రూఢిగా తలంచెను.

క్షణకాలమొకరినొక రిరువురు తీవ్రముగా పరికించుకొనిరి. "అగును—పోలీసువా రాత్మహత్యయని నిర్ణయించిరి—" అని కటు వుగా జగదీశుడు మాఱువలికెను.

"జగదీశబాబూ! మీయభిప్రాయమేమి? మీరేమందురు!"

"నే నేమందును? ఏమయినదియు పోలీసువారే చెప్ప వలయును—"

"అగును రెండు—— హత్యయయినను, ఆత్మహత్యఅయినను, లేక మరేమయినను, మీస్నేహితుని విషాదాంత మరణము మిమ్ములను ప్రయాణమునుండి విరమింపజేయలేదు—" అని వంగదేశీయుడు మందమగు ధ్వనితోపలికెను.

జగదీశు డాశ్చర్యమభినయించినాడు – ఆతని ఆశ్చర్యభావము క్షణములో వంగదేశీయునకు వ్యక్తపడినది——

"జగదీశబాబూ! ఆతడు – పాప మాతడు! – మీస్నేహితుడని మీరు నాతో చెప్పితిరి – అయినను, మీరింకను ప్రయాణము సాగించుచున్నారు."

"అగును – సాగించుచున్నాను; అందులకు కారణమున్నది. నేను _ నామిత్రుడు హత్య కావింపబడెనని గట్టిగా నమ్ముచున్నాను; ఆతనిని హత్యజేసిన దుర్మార్గు నన్వేషించుటకు నేను ప్రయత్నించుచున్నాను – హంతకు డీయోడమీదనే యున్నా డనుట నాకు విదితము—" అని పలుకుచు జగదీశుడు వంగదేశీయుని ముఖచిహ్నములను జాగ్రత్తగా, పరిశీలించుచుండెను.

ఆపలుకులలో సవాలున్నది – ఆసవాలును సులభముగా వంగదేశీయుడు గ్రహించినాడు.

"జగదీశబాబూ! ఈహత్యతో నాకు సంబంధమున్నదని మీరు సందేహించుచుంటిరా?" అని ఆత దాకస్మికముగా నడిగెను.

ఒకటి, లేక – రెండునిముషములవఱకు జగదీశుడు నోరు విప్పలేదు _ తరువాత నొకపరి భుజము లెగురవేసినాడు.

"ఏమో, ఎవ్వ రెఱుగుదురు?"

"ఓహో! ఆలాగునా?" అనుచు వంగదేశీయుడు, అంగీజేబునుండి ఒకసిగరెట్టును బయటకు దీసి, ముట్టించెను.

"బాగున్నది — జగదీశబాబూ! బాగున్నది — మీకు గల అనుమానము నాకు మాత్ర మెందుకుండరాదు? మీస్నేహితుడు — గంగారామ్‌చెర్మన్ — అవును; ఆతనిపే రదే — హత్య గావింపబడెనని మీ రెఱింగియుండియు, మీరు పోలీసువారికి న్యాయముగా చెప్ప వలసిన రహస్యములను గూడ, చెప్పక దాచుటవలన — మీరే ఆతనిని హత్య కావించితిరని నేనెందుల కనుమానింపరాదు? హత్యను గావించి, ఏమియు నెఱుగనివానివలె నటించుచు నీదేశమునుండి పాఱిపోవుటకు ప్రయత్నించుచున్నారని నే నన్నచో —— ——" ఆతడు తనమాటను ముగింపలేదు; జాగరూకతతో జగదీశుని ముఖలక్షణములను బరికించు చుండెను.

"నేను పోలీసువారికి - హత్య కావింపఁబడిన యాతఁడు నా స్నేహితుడని చెప్పకుండుటకు కారణమున్నది; విచారణలో పాల్గొను టకు నాకిష్టములేదు — నేను నాఅభిప్రాయము నీవఱకే మీకెఱిగించి తిని — మీ రేమనుకొన్నను, నాకు బాధలేదు — నేను లక్ష్యపెట్టను." అని జగదీశుడు కఠినముగా ప్రత్యుత్తరమిచ్చెను.

వంగదేశీయు డొకక్షణమువఱకు నవ్వెను.

"మీరు హంతకులని నే ననుకొనను; గంగారాముని హత్య గావించినవాడు నిస్సందేహముగ నీయోడమీదేయున్నాడని నే నెఱుగు దును - మీముఖలక్షణములనుబట్టి మీరు నిర్దోషులని నేను గ్రహింప గలను — ఎట్టివారినైన ముఖమును జూచినంత మాత్రాన - వారి స్వభావమును నేను చెప్పగలను; ఆశక్తి సామర్థ్యములు నాకడ నున్నవి. కారు — మీరు హంతకులుకారు. నేను గట్టిగా ఆమాటను చెప్పగలను. గంగారామ్‌చెర్మన్‌యొక్క హంతకుని నన్వేషించుటకే నేను కూడ నీయోడమీద ప్రయాణము సాగించుచున్నాను; జగదీశ బాబూ! "ఎఱ్ఱతేలు"ను నేను పట్టుకొనవలసియున్నది. ఆత డీహత్యను

గావించుటకు పూర్వమునుండియు, వాని కొఱకు నేను ప్రయత్నించు చున్నాను—"

జగదీశునకింతింతనరాని ఆశ్చర్యముకలిగినది — ఆతడు గట్టిగా వానిరెట్టబట్టుకొని—

"నిజమునకు నీవెవ్వడవు!" అని గద్దించుచు ప్రశ్నించెను. 'ఎఱ్ఱతేల' నుటతోనే జగదీశున కాశ్చర్యముకలిగినది. 'ఎఱ్ఱతేలెవ్వడు! ఎఱ్ఱతేలును గుఱించి ఈత డేమెఱుగును!' అని ఆతడు తనలోతా నను మానించెను.

"జగదీశబాబూ! నే నెవ్వడనో, తెలిసికొనగోరుచున్నావా! ఓడమీాదప్రయాణముసేయుచున్న ప్యాసింజరు — లిష్టులోనాపేరు— "హరిలాల్" కాని, నిజమునకు నే నెవ్వడనో! నీకు చెప్పుచున్నాను— నీస్నేహమునాకు కావలసియున్నది—

ఈ ప్రయాణ మంతమగులోపున, హంతకు నన్వేషించుటకు నాకు నీ సహాయము కావలసియున్నది.—నేను "అరిందమను;"—

ఆవంగ దేశీయుడు హిందూదేశమున పేరుప్రతిష్ఠలనార్జించిన సుప్రసిద్ధపరిశోధకాగ్రగణ్యు డరిందముడా!

---

## యీరడవ ప్రకరణము.

---

## "అరిందముఁడు!"

జగదీశుడు — తననోటిలోనిచుట్టను బయటకుతీసి, అవిశ్వా సముతో — ఆశ్చర్యముతో, తనలోదాను, మరలమరలనా నామ ముచ్చరించుకొను చుండెను. హిందూదేశమునందలి యపరాధపరి

శోధకాగ్రగణ్యులలో సుప్రసిద్ధుడగు నరిందము డాతడేయని తెలిసి కొనుటతోడనే జగదీశునకు కలిగిన ఆశ్చర్యమిట్టిదని యెవ్వరు చెప్ప గలరు! ఆతడింతవఱకా పరిశోధకుని అద్వితీయమైన పుణ్యమును, మహత్తరసామర్థ్యమును వార్తాపత్రికలలో మాత్రము చదివియుండెను. కాని వ్యక్తిగతమగు పరిచయ మాతనితో లేదు — అరిందముడు పారశీకదేశస్థుడయ్యు వంగదేశీయునివలె గన్పట్టు చున్నాడు. భద్మవేషములలో నాతనికున్న నేర్పెవ్వరికినిలేదు — ఆతడేదయిన వేషమువేసి కొన్నప్పుడు, దానికి తగినట్లుభాషను, అలవాట్లను, ఆచారవ్యవహారములనుగూడ మార్చుకొనుచుండును. సాధారణముగా నాతనిగుఱుతు పట్టుట, సామాన్యజనులకు కష్టము.

"సరియే — జగదీశబాబూ! రండు — మనమిరువురము క్యాబిన్ లోనికిపోయి, కొంచెము తేనీటినిత్రాగుదము" అని అరిందముడు జగదీశుని రెట్టమీద చేతితో చఱచుచు ననెను. జగదీశు డంగీకార సూచకముగ తలద్రిప్పెను.

ఇరువురును రెండవయంతస్తునకుదిగిరి. ఓడయొక్క వెనుకభాగమందున్న స్మోకింగ్ రూములో ప్రవేశించిరి. సముద్ర తరంగములను భేదించుచు — నౌక మందగమనమున పోవుచున్నది. దూరమందున్న యంత్రముల ధ్వనిలో — ప్రయాణికుల సంభాషణములు — అట్టహాసములు స్పష్టముగ వినబడుచున్నవి. సూర్యకిరణములు స్వేచ్ఛగా సముద్రజలములలోనికి చొచ్చుకొనిపోవుచున్నవి. అవి నీలజలోపరిభాగమున, తెల్లగనున్న సాలవీనునౌక చూపఱకు నేత్రపర్వముగ నున్నది. ఆదినమున 18 వ నెంబరుగదిలో సంఘటిల్లిన దారుణహత్యా సంబంధమగు నాత్రము తప్ప — ఆయోడయందు వేఱొండు విషాదకారణమేదియు గోచరించుటలేదు; ప్రయాణికులందఱు నారహాస్య మెఱుంగరు గనుక, హాయిగా లోకాభిరామాయణముతో ప్రొద్దు పుచ్చుచున్నారు.

స్మోకింగ్ రూములో నొక మూలనుండి మందమగు కంఠమున ఈ మాటలు వినబడినవి. "పీపిల్సు పార్కులో జరిగిన హత్యయింకను నిగూఢమగురహస్యమే!" 'వైర్‌లెస్ కాడ్‌స్పీకరు' ద్వారా వార్తాపత్రికలోని విషయములు ప్రయాణికులకు ప్రకటింపబడుచున్నవి. జగదీశు డరిందముతోగూడ నాగదిలో — ఇతర ప్రయాణికులమధ్య కుర్చీలో గూరుచుండెను. స్టీవర్డు తేనీటిగ్లాసులను తెచ్చి మేజాబల్లల మీదపెట్టగా ప్రయాణీకులు త్రాగుచున్నారు.

అరిందముడు వైర్‌లెస్ సమాచార మాలకించినంతనే, తన కుర్చీని, జగదీశబాబునకు దగ్గఱగా నీడ్చుకొనెను. జగదీశునకు హృదయములో ప్రశాంతతలేదు; సహనములేదు; కాలయాపనమున కాతడోర్లకుండెను. తన మిత్రుడగు గంగారామ్‌చెర్మక్ హత్యకు సంబంధించిన విషయముల నరిందముని నోటినుండి వినుట కాతడు కుతూహలపడుచున్నాడు.

"ఎర్రగా జుట్టుండును; కండ్లు పిల్లికండ్లు; పై దౌడలో నొక పన్ను లేదు—" అనుమాటలు మరల వైర్‌లెస్‌నుండి వినవచ్చినవి.

బొంబాయి నగరములోని, రక్షకభటాదికారులకు ఈమధ్య పీపిల్సుపార్కులో హత్య గావింపబడిన నిర్భాగ్యుని పేరు, ఊరు మున్నగునవి యెవ్వరయిన దెలుపగలుగుదురేమో అని, పై సమాచార మనేకపర్యాయములు బ్రాడ్‌కాస్టు, చేయబడినది.

జగదీశుడు — అరిందముని ముఖచిహ్నములనుబట్టి, ఆతడు ప్రయాణికులతో మధ్య మధ్య నిష్టాగోష్ఠి సలుపుచున్నను, వైర్‌లెస్ ద్వారా వినిపింపబడిన హత్యావిషయముల నత్యంత శ్రద్ధతో నాలకించుచుండుట, అవగతమయినది. అరిందముడు వైర్‌లెస్ వార్త ముగిసినంతనే జగదీశు నవలోకించి—

"జగదీశబాబూ! తేనీరుత్రాగుట అయిన యెడల నాగదిలోనికి పోవుదము రండ" నెను.

జగదీశుడు స్మోకింగురూమును, విడిచి, అతని ననుసరించెను.

అరిందముని గది—రెండవ అంతస్థులో, సరిగా 18 వ నెంబరు గదికి క్రిందనున్నది. ఆ గదినెంబరు 144 బొంబాయి హార్బరులో "భగత్ సింగ" ను మారుపేరుతో నరిందముడు దానిని, ప్రత్యేకముగా తన కొఱకు బుక్ చేసికొనెను. సరిగా నా గదికి పైన ఉన్న గదిలోనే—13 వ నెంబరు గదిలోనే—గంగారామ్ చెర్మక్ హత్యకావింపఁబడినాఁడు.

అరిందముడు తన గదిని సమీపించి, తలుపు తెఱచినాడు; జగదీశుడు లోనప్రవేశించిన వెనుక, తానును అందు ప్రవేశించి, మరల గది తలుపుమూసి గడియను నొక్కినాడు; కిటికికి కట్టబడియున్న తెఱలను తొలగించుటచే వెలుతురందు నిరాటంకముగా ప్రవేశించుచున్నది. ఆ గది పెద్దదికాకపోయినను, మిక్కిలి అందముగానున్నది. జగదీశుని సోఫామీదఁ గూరుచుండ నియమించి, అరిందముడు – మేజాబల్ల మీదనున్న సిగరెట్ పెట్టెను తెఱచి, అందుండి యొక సిగరెట్టును గైకొనెను.

"జగదీశబాబూ! నౌకలో నితరులు చూచుచుండగా—సిగరెట్లుగాని, చుట్టలుగాని, కాల్చుటకు నాకిష్టముండదు"—అని పలుకుచు నాతడు తీవ్రములగు దృక్కులను వానిపై బఱపుచుండెను.

అరిందమునకు జగదీశుని బలిష్ఠకాయము నెడల నేలకో మిక్కిలి మక్కువ కుదిరినది. విశాలమగు నాతని వక్షస్థలము—తేజోవంతములగు నాతని కన్నులు – కార్యదీక్షను, మనోదృఢత్వమును ప్రకటించుచున్నవని ఆతఁడు గుఱుతించెను. తనకుగల అనుమానములే యదార్థములయిన యెడల, పాలపీను నౌకపై జగదీశుని సహాయము తన కత్యవసరమని అరిందము డనుకొనెను.

అరిందముడు సోఫామీద కూలబడెను. జగదీశుఁడు, రెప్ప వేయకుండ నాతని ముఖమును బరికించుచున్నాడు.

"మీ కెంతవఱకు తెలియును?" అన్నప్రశ్న మాకస్మికముగా నాతని నోటినుండి వెలువడినది.

"జగదీశబాబూ! ముందు — మీ కెంతవఱకు తెలియునో, నాకెఱిగింపుడు —" అని అరిందముఁడు ప్రశ్నించెను.

"నాకింతకంటె నేమియు తెలియదు —" అని పలుకుచు, జగదీశుడు, తనచేతిని అంగీయొక్క లోపల జేబులోనికి పోనిచ్చి, గంగారామ్‌చెర్మన్ తనకు వ్రాసిన యుత్తరమును బయటకు దీసి — ఆయుత్తరమే — తా నాసమయమందు సాలవీను నౌకమీద నుండుటకు కారణమనియు — దాని మూలమునసనే తనమిత్రు డేదో అపాయస్థితిలోనుండి, అత్యవసరముగా తన్ను జూడగోరినట్లు గ్రహించి, వచ్చితిననియు - నాయుత్తరమే తనకు దీఱని క్లిష్టసమస్యయై హృదయమందలి శాంతతను పోగొట్టినదనియుజెప్పుచు — దాని నాతని చేతి కిచ్చినాడు. మఱియు దా నాయుత్తరమును దన మేడలోని గదిలో మేజాబల్లమీాద జూచితిననియు - చూచిన వెంటనే, గంగారాముని మేడకడకు వెళ్లి, యింటిలోనివారి నాతనిని గుఱించి ప్రశ్నింపగా — ఆత డదివఱకు వారము దినములక్రిందటనే, ఎక్కడకో గమ్యస్థానమును తమకు తెలుపకుండగనే, వెళ్ళియుండెననియు నెప్పుడు తిరిగి వచ్చునదియు దమ కెఱిగింపలేదనియు, చెప్పిన ట్లాతడు వాని కెఱిగించెను.

"గంగారామ్‌చెర్మన్ యొద్దనుండి ఈయుత్తరము—— —— ——

జగదీశుఁడు తనమాటను ముగించలేదు. అరిందముఁడు దానినందుకొని చదివి, తలయూంకించుచు మరల దానినాతనికిచ్చివేసెను.

"నేను లండనునకు వెళ్ళుటముందు — అనఁగా మూఁడు సంవత్సరములక్రిందట నేను వానిని జూచితిని——మరల నీనాఁడు — ఈవిధ

ముగా వాని మృతకళేబరమును కనుఁగొంటిని. మేమిరువురము బాల్యస్నేహితులము; అందుచేతనే — పాపమాతఁడు — దుర్భరమగు నాపదలోఁదగుల్కొని, సహాయముకొఱకు నన్నర్థించినాఁడు—"అనుపలుకులు జగదీశుని నోటినుండి, అతికష్టముమీఁద వెలువడినవి. అతఁడిక మాటలాడలేదు. ముఖము నించుకదించుకొనెను. అరీందముఁడులేచి, క్షణకాలమునిలువబడి, తరువాత గదిలో మెల్లగా నిటునటు పచారుచేయుట కారంభించెను. అతని పాదములక్రింద యంత్రములధ్వని నౌకయొక్క అధోభాగమునుండి వచ్చుచు — నాతని చెవులఁబడుచున్నది. సాలవీనుప్రయాణము చేయుచు, కొంచెము వేగముగా పోవుచున్నదని అతడు గ్రహించినాడు.

"మీకు—మీకు—జగదీశబాబూ! పాపము! మీ మిత్రుని హత్య ఆశ్చర్యకరమై యుండును; కాని నే నాశ్చర్యపడను; నేను భేదించుటకు ప్రయత్నించుచున్న రహస్యశక్తులలోనిది యొకటని నే నీవఱకే ఎఱుగుదును. గంగారామ్‌చెర్మన్ హత్యకావింపబడునని నే నెఱుగుదును. అతనిని రక్షింపగడుగుదునని నే ననుకొంటిని, కాని ఆకార్యమును చేయజాలకపోయితిని. అందులకు—అనగా — అతనిమరణమున కాతనినేరమే కారణము." క్షణకాల మరీందముఁడు మౌనము వహించెను. నోటిలోని సిగరెట్టునకుగల బూడిదను క్రిందకుదులిపెను. జగదీశు డాత్రముతో వినుచుండెను.

"నేను గంగారాముని జాగ్రత్త?" యని హెచ్చరించితిని — కాని ఆనిర్భాగ్యుడు తన మతిని పాడుచేసికొనెను. ఇఁక నాపీపిల్సుపార్కుహత్య ———" అని అరీందమింకను చెప్పబోవుచుండెను.

"పీపిల్సుపార్కు హత్య!" అని ఆశ్చర్యముతో, జగదీశుడు వెనుకకు చేరగిలబడినాడు— "ఓయి భగవంతుడా! ఆహత్యకును, గంగారామునకును సంబధమున్నదా?"

అరిందముడు తలయూచినాడు—

"బొంబాయిలోని రక్షకభటాధికారులు — వీపిల్సుపార్కులో హత్యకావింపబడిన యా నిర్భాగ్యవ్యక్తిని తెలిసికొనుటకు విశ్వప్రయత్నములను గావించుచున్నారు; గంగారామ్‌శెర్మక్ బ్రతికియుండిన యెడల నావ్యక్తి యెవ్వడో వారికి జెప్పగలిగియుండును."

"ఓయి భగవంతుడా!" అని వేదనాసూచకమగు కంఠముతో జగదీశుడు సణుగుకొనెను—ఆతడు మరల—"మీ యభిప్రాయమేమి?" అని ప్రశ్నించినాడు.

"గంగారామ్ రక్షకభటులకా వ్యక్తియొక్క కులగోత్రములను, ఊరుపేరులను తెలియజేసి యుండెడివాడు! — ——జగదీశబాబూ! కొన్ని నేరములలో నేను బొంబాయి రక్షకభటాధికారులతో కలిసి, పనిచేయుట కిచ్ఛగింపను; నాయూహలు — నాయెత్తులు వేఱుగా నుండును. ఈహత్యాభేదన ప్రయత్నమును, నేను ప్రత్యేకముగ వహించితిని. అందులకు కారణము లేకపోలేదు. హంతకునకును, నాకును, దెబ్బాదెబ్బపందెముకి్రిందనున్నది. గంగారాముని హత్యగావించి, ప్రసిద్ధులగు నిరువుర డాక్టర్ల కండ్లలో దుమ్ముజల్లి — వారికి పోలిక దొరకకుండునట్లు చేసి, మీకు మిక్కిలి వారిచేత నాత్మహత్య యనిపించిన అసాధారణవ్యక్తి యాతడు! ఆతని నన్వేషించుటయే నాప్రస్తుత లక్ష్యము. ఆతడీ క్షణమున నీయోడమీదనే యున్నాడు—"

"మీరెఱుంగుదురా? హంతకుని మీరెఱుంగుదురా?" అని జగదీశు డాత్రముతో ప్రశ్నించెను.

"జగదీశబాబూ! నే నెఱుంగుదును; కాని వాని పేరు నాకు తెలియదు. నే నింతవఱకు వాని ముఖమును జూచియుండలేదు. నేను మీకెఱిగింపగల రహస్యమిది యొక్కటే! ఆ హంతకుఁడు సాంకేతిక నామముతో వ్యవహరించుచున్నాడు — ఆనామము బొంబాయి నగర

ములో ననేకులు వినియుండిరి. అనేకు లాదుర్మార్గుని హస్తమున మర ణింపబడిరి. ఆనామమునే పాపము!——చెర్మకు — గోడమీద, తనరక్త ముతో వ్రాసినాడు——"ఎర్రతేలు!"

"ఎర్రతేలు! అని జగదీశు డామాట నుచ్చరించి, శరీరము కంపింప నొకనిట్టూర్పుబుచ్చెను. ఆ పేరు — తడిరక్తములో 18 వ నెం బరు గదిలో వ్రాయబడినది. ఆతడు స్పష్టముగఁ జూచినాడు. ఇప్పటి కిని, అది తనమెదడులోనున్నది.

ఆతడు మాటలాడు లోపున — తలుపున కావలహఠాత్తుగా నేదియో చప్పుడు వినఁబడినది. జగదీశుఁడును, అరిందముడును, తొట్రుపాటుతో తలుపును దెఱచి ఆవలకు పోయిరి.

అరిందమునకు — తలుపునొద్ద నిలువబడి తమసంభాషణము నెవ్వరో వినుచుండిరన్న సందేహము మెదడులో ప్రవేశించినది. ఆతడు తొందరగా నల్వంకల బరిశీలించెను. ఆతనికి తలుపు నకించుక దూర ములో నొకస్త్రీమూర్తి కంటబడినది. ఆత డామెను సమీపించినాడు. ఆమె నొకయొక్క ఊచల కానుకొని నిలువఁబడియున్నది, వదనము మనోహరమయినది, నేత్రములు విశాలము లయినవే! — కాని, మూయు బడియున్నవి; శిరోజములు సుదీర్ఘములు; కుటిలములు — ఆయువతి ఆకస్మికముగా క్రింద కొరగినది.

"పాపమామె స్పృహతప్పి పడిపోయినది!" అని జగదీశుడను చెను. ఆతడు తన చేతులతో నామెను పైకెత్తి, మెల్లగా ప్రక్క నున్న కుర్చీలోనికి దెచ్చినాడు. ఆమెయొక పరికన్నులను విప్పినది; నిట్టూర్పుబుచ్చినది. ఆత డామెచూపులలో ముహూర్తకాలము—— తన చూపులను గలిపినాడు.

"సరిగాకూరుచుండుడు; మీరు స్పృహదప్పి పడిపోయితిరి; నేను డాక్టరును దీసికొనివచ్చెదను——"

"వలదు — వలదు — అట్లు చేయకుడు!"

ఆమె త్వరలోనే, సేదతేఱుచున్నట్లు కన్పట్టెను. ఆమె లేచి, సర్దుకొని సరిగా కుర్చీలోకూరుచున్నది; నల్వంకల నాత్రముతో పరికించి నది; ఆమె బుగ్గలెఱ్ఱబాఱినవి.

"నేనిక్కడకెట్లువచ్చితిని!---- నేను ---- నేను — స్పృహతప్పి పడిపోయితిని. నేను — ఈ మార్గముగుండా పోవుచుంటిని. అగును — హఠాత్తుగా నాశరీరము కంపించినది — వద్దు; డాక్టరును పిలువవద్దు — నేనిప్పుడు సేదతేఱితిని" అన్నదామె.

"అయినయెడల, మిమ్ములను మీ గదిలోనికి దిగబెట్టెదను—— రండు——" అని జగదీశుడనెను.

ఆమె తనవిశాల వినీలనేత్రములతో నొకపరి జగదీశునవలోకించి నది; తరువాత——అరిందముని పరికించినది.

"నాగది!" ఆమెతలత్రిప్పినది. "మీరునన్ను గదిలోనికి దీసి కొని వెళ్ళలేరు. ఇంతకునాకు గదిలేదు."

"మీ మాటలు నాకు బోధపడుటలేదు——" అని జగదీశుడు వ్యాకులముతో ననెను.

ఆయువతి బిగ్గఱగా నవ్వినది.

"నేను ప్రయాణము చేయుటకు రాలేదు; నౌకను చూచి పోవుటకు మాత్రము వచ్చితి నంతే!"

"మీరు ప్రయాణికులలో నొకరు గారా? పరిహాసమాడు చున్నారు!"

"లేదు — పరిహాసమాడుటలేదు. ఈ నౌకమీఁదనుంటకు నాకధికారములేదు. నాలవీను నౌకనుజూడవచ్చిన వారందఱు, ప్రయా ణారంభమునకు ముందు దిగి వెళ్ళిపోయిరి. నేను మాత్రము పోలేదు — ఇట్లు చేయుట పిచ్చితనముగాదా?"

"మీ రిప్పుడయిన 'పైలట్' ద్వారా యీ నౌకనుండి వెళ్ళి పోవచ్చును." అని అరిందము డనెను.

"ఓ, వద్దు — వద్దు — అట్లు చేయను. నాదగ్గఱ కావలసినంత ధనమున్నది. చెక్కు-బుక్కున్నది; నౌకలో నెక్కువయిన ఖాళీగదియుం డిన జాలును. నాతో సామానులేవియులేవు; నాకు కావలసిన వస్తువు లను — రాబోవు రేవులో కొందును."

ఆమె విచిత్రముగా మందహాసమొనరించుచున్నది; ఆమెలో గల సోయగము జగదీశు నాకర్షించినది. ఆత డాయువతి, అసాధారణు రాలని యనుకొని, యొకపరి నవ్వినాడు.

"సరియే! పర్సరు మీయభిప్రాయ మెఱిగి, ఏమిచెప్పునో! నా కేమియు బోధపడుటలేదు ..... మీరు మీస్నేహితులకు — మీబంధుగులకు - ఇక్కడనున్న విషయమును రేడియోద్వారా తెలియ జేయవచ్చును" అని ఆత డనెను.

"అగును — అట్లు చేయవచ్చును" అని ఆమె అన్నది. క్షణ కాల మామె నేత్రములు వివర్ణములయినవి. ఆనేత్రములలో నాకస్మిక భయోద్రేకములు జగదీశునకు పొడసూపినవి; కాని, అవి మరల నంత లోనే నశించినవి. ఆత డామె భావవిలక్షణములకు, ఆశ్చర్యపడసాగెను.

ఆకస్మికముగా నాతని మెదడులో నాలోచనము లనేకము లుద యించినవి. ఆమనోహర స్త్రీమూర్తి — ఊఱకే, కారణములేకుండగనే, నౌకను చూచుటకు వచ్చినదా? వచ్చి నౌకమీద నుండిపోయినదా? ఆమాట వాస్తవమా? దానిని విశ్వసింపవచ్చునా? లేక, ఆమె ఆనౌక మీద ప్రయాణము సాగించుటకు తగినంత రహస్య హేతువు — అత్యావ సరమయినదేదయిననుండునా? — ఇట్టి యనుమానము లాతని హృద యమును గలచుచున్నవి.

"మీ కీనౌకమీద స్నేహితు లున్నారనుకొందును; వారిని సాగ నంపుటకే మీరు వచ్చి యుందురు." అని అరిందము డనెను.

క్షణకాల మాప్రశ్న కామె – సమాధానము చెప్పుటకు తోచ నిదానివలె, విస్మయమందినది గాని మరల మనసును గుమటపఱచు కొన్నది. ఆమెతల త్రిప్పినది.

"లేరు – నాకుస్నేహితు లెవ్వరునులేరు; ఈనౌకను చూచు టకు కుతూహలమున్నది; ఇదివఱలో నిట్టి పెద్దయోడలను నేనెన్నడును జూచియుండలేదు; ఎట్లయిన దీనిని జూడవలయునన్న యుత్సాహముతో-షిప్పింగు – ఆఫీసులో నీ నౌకమీద నాస్నేహితులు కొందఱున్నార నియు, వారిని జూడబోవుచున్నానని యు జెప్పి, వచ్చితిని."

ఆమెలేచి నిలువబడినది. "నేనిప్పుడు బాగుగా తేలుకొంటిని" అని ఆమె తొందఱగా మాటలాడ నారంభించినది. "మీకు కృతజ్ఞు రాలను – నేనెందుల కట్లు స్మృతి తప్పి పడిపోయితినో, ఊహింపలేకు న్నాను – హాస్యాస్పదము—నేనిప్పుడు వెళ్లి పర్సరును గలసికొనవల యును. పర్సరు ఆఫీసు - - -"

ఆమె హఠాత్తుగా మౌనము వహించినది. 13 వ నెంబరు గది వంకమాత్రము తన దృక్కులను బఱపుచున్నది.

అరిందముడు తన చూడ్కులను గది తలుపువంకకు బ్రసరించి నాడు. అక్కడ నొకవ్యక్తి నిలువబడియుండెను. ఆతని రాక నా ముగ్గురిలో నొక్కరయిన నంతకుమున్ను కనిపెట్టియుండలేదు. ఆతడు పాదములకురబ్బరుజోళ్ళు తొడుగుకొని యుండెను. ఆతడు పొడవుగను, నల్లగనువుండెను. బుగ్గలమీద నొత్తుగా వెండ్రుకలు పెరిగియున్నవి. మీసములు పెద్దవి. ఆకారవిశేషాదులనుబట్టి చూడగా, నేపాల దేశస్థునివలె గన్పట్టుచున్నాడు.

## మూడవ ప్రకరణము

కొన్ని క్షణములవఱకు నానూతనపురుషునినేత్రములు జగదీశుని పైన నిలిచియున్నవి. పిమ్మట వానినుండి అరిందముపైనను—తరువాత నాయువతిమీాదికిని ప్రయాణముసాగించినవి.

అప్పు డాప్రదేశమున గాంచనగు నిశ్శబ్దములో—సముద్రతరంగ ములఘోషమాత్రము విస్పష్టముగా వినఁబడుచున్నది. నిలువఁబడిన ఆముగ్వురి పాదముల క్రిందను నేల—క్రిందకు, మీాదకు లేచుచు పోవుచు నుండుటచేత పాలవీను నౌక వేగముగా పోవుచున్న దనుమాట తెల్లము.

“అయ్యా!” అనుమాట—ఆనేపాలదేశస్థుని నోటినుండి వెలు వడినది. అతఁడు అరిందముని, జగదీశుని, తదేకధ్యానముతో మరల పరికించినాఁడు

“అయ్యా! ఈవస్తు వెవ్వరిది?” అని ప్రశ్నించుచుఁ దనచేతిలో నొకచిన్నవస్తువును బట్టుకొని, ముందుకు చాచినాఁడు.

హఠాత్తుగా—ఆయువతి వస్తువును జూచి అదిరిపడినది. ఆమె నోటినుండి అప్రయత్నముగా — “అగును. నాదే! ఈవస్తువు నాదే! నేను—” ఆమె మఱి మాటాడలేదు. ముందునకు నడచి, ఆనేపాలదేశ స్థుని చేతిలోనున్న చిన్నవస్తువు నాత్రముతో నందుకొని, పిడికిట మూసి కొన్నది.

“ఈగది తలుపునకు ప్రక్కగా నావస్తువుపడియుండఁగా నేను చూచితిని — నేను మీాకు సహాయపడఁగలిగినందులకు సంతోషించు చున్నాను;” అని పలుకుచు నేపాలదేశస్థుఁడు మందహాస మొనరించెను.

“నే నింక—పర్సరుఆఫీసునకు వెళ్ళుట మంచి దనుకొందును—” అని ఆమె జగదీశునివంకఁ దనచూడ్కులను నిగుడించినది.

"నేను మీకు దాటిచూపింతును." అని జగదీశుఁ డనెను.

అరిందముఁడు—జగదీశుఁ డామెను దనవెంటఁబెట్టుకొని వెళ్ళు చుండఁగా వెనుకనుండి కనిపెట్టుచుండెను. అతఁడు—తరువాత—తనగది లోనికిపోయి, తలుపునుమూసి, సిగరెట్టును నోటఁబెట్టుకొని వెలిగించెను.

ఊరకే, పని లేకుండఁగనే, నౌకను జూచుటకువచ్చి, అండే ఉంటినని ఆయువతి చెప్పిన మాటలు కల్పితములనియు, వానిలో యదార్థములేదనియు నరిందముఁ డనుకొనెను. ఆమె—ఆవిషయమును జెప్పుచుండఁగా నాతఁడు పరిశీలించినాఁడు. అతఁడు—సులభముగా—ముఖచిహ్నములనుబట్టియు — నేత్రములను జూచియుఁ— యదార్థమును గ్రహింపఁగలఁడు. అట్టి శక్తి వానికున్నది. ఆమె తగినంత పనిమీఁదను—ప్రకటింపవలనుగాని హేతువుచేతను—కోరి ఆనౌకమీఁద నున్నదని అతఁడు గ్రహించినాఁడు—ఆహేతువును దెలిసికొనుటకు కుతూహల పడుచున్నాఁడు—నేపాలదేశస్థుని చేతులలోనుండి—ఆత్రముతో నామె లాగికొని, పిడికిట మూసికొన్న వస్తువును—ఆవస్తువుమీఁదఁ జెక్కఁబడిన భయంకర నామమును—జగదీశుఁడు కనిపెట్ట లేకపోయినను అరిందముఁడు కనిపెట్టినాఁడు.

నల్లగా, నొకఅంగుళము పొడవు—అంగుళము వెడల్పు — అంగుళము ఎత్తు నున్న రాతిమీఁద నాలుగక్షరములు చెక్కఁబడియున్నవి. ఆవస్తువునే ఆతఁ డాయువతిచేతిలో జూచినాఁడు — ఆవస్తువునకును, ఆమెకును ఎట్టి సంబంధమున్నది.

పెద్దతోకతో కూడిన ఎఱ్ఱతేలు ఆరాతిమీఁదఁ జెక్కఁబడినది. 'ఎఱ్ఱతేలు' అను నక్షరములందు గోచరించుచున్నవి?

## నాలుగవ ప్రకరణము

144వ నెంబరుగల తన స్టేటురూములో నరేంద్రుఁ డిటు నటు పచారు చేయుచుండెను—ఆతని నేత్రములలో ఆలోచనాధారము వ్యక్త పడుచున్నది. బొంబాయినగరమును వీడి సాలవేను నౌక—సీలోనుద్వీప మును జేరుటకు—సూర్యుని సాంధ్యరాగకాంతులలోఁ బ్రయాణము సాగించుచుఁ జూపఱకు హాయిని గూర్చుచున్నది.

---

## నాలుగవ ప్రకరణము.

---

సాలవేను నౌకయొక్క యంత్రాగారములో, గంట ఎనిమిది పర్యాయములు మ్రోగినది—రాత్రి ఎనిమిదిగంటలయినది. నౌక త్వరిత గమనమున పోవుచున్నది. పొగమంచు సముద్రమంతయు నలముకొని—నౌకను గూడఁ గనఁబడకుండఁ జేయుచున్నది.

స్మోకింగ్ రూములోనున్న ఆర్కెష్ట్రా—డ్యాన్సింగు ట్యూనులను హాయిగా వినిపించుచున్నది. ప్రయాణికులలో కొందఱు నవ్వుచున్నారు; మఱికొందఱు లోకాభిరామాయణములో సంతోషించుచున్నారు; కొందఱు కూనిరాగములను తీయుచున్నారు. ఇంకను గొందఱు పాశ్చాత్యపద్ధతుల ననుసరించి, డ్యాన్సు చేయుచున్నారు.

జగదీశబాబు—ఆసమయమున, స్మోకింగురూమున కావల కుర్చీలో, గూరుచుండియుండెను; ఆతఁడు బనియను తొడుగుకొని, లుంగీని గట్టుకొనియున్నాఁడు—నోటిలో చుట్టపైపున్నది; అం దుండి కొంచెము

కొంచెముగా పొగబయటకు వచ్చుచున్నది. ఆతనికి దూరమం దుండి వినఁబడుచున్న ఆర్కెష్ట్రావాయిద్యములుగాని-ప్రయాణికుల గందరగోళ ముగాని, చెవినిబడుటలేదు. ఆనాఁడు 13 వ నెంబరు గదిలో జరిగిన దారుణహత్యయే స్ఫురణకువచ్చుచున్నది; గంగారాముని మృతకళే బరమే, కట్టెదుటఁ గనఁబడుచున్నది. మరణకాలమున--పాప మానిర్భా గ్యుఁడు తనరక్తములో వ్రేలుముంచి, గోడమీఁద వ్రాసిన సాంకేతిక నామము జగదీశుని హృదయమును గలఁచుచున్నది. "ఎఱ్ఱతేలు!"

ఆతఁడాపేరును గుఱించి అరిందముని దయవలనఁ గొంతవఱకు తెలిసికొనెను. 'ఎఱ్ఱతేలుగాఁడాసమయమున నాయోడమీఁదనే యున్నాఁడని అరిందముఁడు చెప్పిన మాట నాతఁడు మరచిపోలేదు?

"మిస్. శంపాలత"ను -- స్పృహతప్పి -- అరిందముని స్టేట్ రూమున కేవలపడిపోయిన యువతిపే రది--పర్సర్సు ఆఫీసునకు తీసికొని వెళ్ళి--ఆతనితో చెప్పి నామెకు, ఖాళీగదియొకటి యిప్పించి -- జగ దీశుఁడు--మరల నరిందముని గదిలోనికివచ్చి, ఆతనినుండి 'ఎఱ్ఱతేలు'నకు సంబంధించిన మిగతా గాథను పూర్తిగా నాలకించినాఁడు.

బొంబాయినగరమునలో — ముతుంగాయందు జరిగిన చిన్న హ త్యా రహస్యమునుభేదించు సందర్భములో మొదట అరిందము డెర్రి తేలను పేరునాలకించియున్నాడు. సాధారణముగా నామహాపట్టణము నందలి ప్రజలలో ననేకులా సాంకేతికనామము నదివఱలోనే వినియుండిరి. కాని—ఎఱ్ఱతేలునుగుఱించి — ఆతనిసంఘసభ్యులకుతప్ప — ఇంతవఱ కెవ్వరికిని, ఏవిధమగు రహస్యమును దెలియలేదు.

ఎఱ్ఱతేలు! ఆపేరుతో వ్యవహరించుచున్నవాఁ డసాధారణ మనుష్యుఁడని అరిందమునివలన జగదీశుఁడాలకించెను. ఆతఁడు చేయని

దొంగతనములేదు. అవసరమయినప్పుడు వెనుదీసినహత్యలేదు; బొం బాయి—పునహా—శికిందార్బాదు నగరములలోని ప్రజలు కొన్నిసంవత్స రములనుండి ఆపేరువినినంతనే తుల్లిపడుచుండిరఁట! కల్యాణపూర్ మహారాజా బొంబాయినగరమునుండి, పునహా హార్సురేసింగుచూడ బోవు చున్నపుడు ట్రెయినులో నెఱ్ఱతేలువలననే హత్యకావింపఁబడెను. బరోడామహారాణి కలకత్తా విమానములో ప్రయాణముచేయు చుండ గా నామె ఆభరణములనెఱ్ఱతేలే హరించినాఁడు— భవానీపురములో జీవనలాల్ అండ్ కంపెనీలోని యినుపపెట్టె ఎఱ్ఱతేలువలననే భేదింపఁ బడినది—బొంబాయి యింపీరియల్ బ్యాంకిలోని పదిలక్షలరూపాయిల విలువగల నోట్లను ఎఱ్ఱతేలే దొంగిలించినాఁడు — ఒటికాదు — రెండు కాదు! అతడు చేసినహత్యాచారములు— వందలు! వేలు!! లక్షలు!! కోట్లు!!!

ఆ ఎఱ్ఱతేలును బట్టుకొనుటకే బొంబాయి రక్షకభటవర్గము వారును — అరిందముఁడును, విశ్వప్రయత్నములు గావించుచున్నారు. బొంబాయిరక్షకభటాధివర్గము వారరిందమునిలపై మఱియొక రహస్య భేదనకార్యమును మోపిరి; కాని, అతఁడు దానినంతగా లెక్కపెట్టలేదు. ఎఱ్ఱతేలును దెలిసికొనుటకే అతఁడు తొందరపడుచున్నాఁడు.

హత్యకావింపబడిన గంగారామ్‌చెర్మక్—ఎఱ్ఱతేలునకు విరోధి యని—అరిందముఁడు తెలిసికొనెను. ఎఱ్ఱతేలునకా నిర్భాగ్యుఁడు విరోధియగుటకు కారణమేమి! అతఁడు గ్రహింపలేదు — చెర్మక్ స్పష్టముగా నెఱ్ఱతేలు నెఱుఁగును — కాని అతనిగుఱించి — అరింద మునికెఱిఁగింపలేదు; పూర్తిగా మౌనమువహించినాఁడు. ఆమౌనము నకు భయమే కారణము. అరిందముఁడు, భయములేదనియుఁ దనకు, ఎఱ్ఱతేలునకు సంబంధించిన రహస్యములను దెలిపినచోఁ, దానాతని

రక్షింపఁ గలవనియుఁ జిలుకకు చెప్పినట్లు చెప్పినాఁడు — కాని అతఁడు వినలేదు.

ఎఱ్ఱతేలును గుఱించి బాగుగా నెఱిఁగిన మనుష్యుఁడు వేఱొకఁడు కలఁడు——అతఁడు గంగారాముని స్నేహితుఁడు — గిరిధరలాల్ కాని పీపిల్సుపార్కులో గిరిధరలాల్ కూడ హత్య కావింపఁబడినాఁడు; ఆ హత్యకూడ నెఱ్ఱతేలు హ స్తమునజరిగినదే!

గిరిధరలాల్ హత్యకు అనంతరము — అరిందమునకు గంగారామునిజాడ కనబడలేదు. గంగారాముఁడు రహస్యముగా నితరులకుఁ గనఁబడకుండ, దాగియుండెను. అతఁడేదో కారణమువలన యస్. యస్. పాలవీనునౌకలో నొకగదిని బుక్ చేసినట్లు——అరిందముడెఱుఁగును. బొంబాయి నగరమునుండి పాఱిపోవుటయే గంగారాముని అభిప్రాయముకాదనియు — అట్లయిన నేరైలుమీఁదనో, లేక, మఱియే యితర నౌకమీఁదనో అతఁడు పాఱిపోయి యుండుననియు — ప్రత్యేకముగా పాలవీనునౌకమీఁదనే ప్రయాణమొనరింప తలంపుగలిగి నందులకు దగినంత కారణమేదియో యుండుననియు నరిందముఁడు భావించి, విశ్వసించెను.

ఆవిశ్వాసముతోనే అతడు—తానుగూడపాలవీనులో ప్రవేశించుటకు కృతనిశ్చయుఁడై —భగత్‌సింగనుమాఱుపేరుతో 144 వ నంబరు గది బుక్‌చేసికొన్నాడు. నౌకలోప్రవేశించిన పిమ్మట గంగారామ్‌చెర్మాయొక్క మృతకళేబరమును కన్నులార గాంచినాడు.

తాను వెదుక బ్రయత్నించుచున్న దుర్మార్గునివలన మఱియొక హత్య గంగారామునకును—ఎఱ్ఱతేలునకునుగల సంబంధము మాత్రమరిందమునకు గూడ గ్రాహ్యముకాలేదు. కాని యొక మాట మాత్రము

నిజమయినది—యాథార్థమైనది—అధార్మికుని హత్యారహస్యమునకును, పాలవీను నౌకకును సంబంధమున్నది. అందుచేతనే హంతకుడిప్పుడు కూడనాయోడమీదనే యున్నాడు.

ఈపై ఆలోచనములు, సందేహములు—జగదీశుని మెదడులో ప్రవేశించి పనిచేయుచున్నవి. అతడు తనదృక్కులను గవాక్షమునుండి సముద్రముమీదికి పఱపుచున్నాడు. నౌకమహావేగమున పోవుచున్నది. వేలువేలు యంత్రములు విధివిరామము లేకుండ స్వకార్యములను నిర్వహించుచున్నవి.

ఎర్రతేలు నౌకమీదనున్నాడు! తనమిత్రుడగుగంగారాము నాతఁడే దారుణముగా హత్య గావించినాడు. ఆతడితరప్రయాణికులతోబాటు తాను నౌకడై యున్నాడు. ఇదియే జగదీశుని ఆలోచనము?

“అగును! ఏమయినమనరే! మేము వానినిపట్టుకొందుము” అను మాట లప్రయత్నముగా నాతనినోటినుండి వెలువడినవి. ఆతనికంఠము దృఢత్వమును సూచించుచున్నది.

ఆతని నోటినుండి అప్పు డారీతిగా వెలువడిన మాట శపథరూపముం దాల్చి--మృతుఁడైన గంగారామ్‌చెర్మ్కారయొక్క ఆత్మవట్ల సానుభూతింజూపినదని మాపాఠకులు గ్రహింపవచ్చును—

“అంత కంతకు మంచు--అధికమగుచున్నదే!” అను మాట లాకస్మికముగా జగదీశుని చెవులఁబడినవి--ఆతఁడు వెనుకకుఁ దిరిగి చూచినాఁడు--చూచుటతోనే......కంపాలత గదికి సమీపమున మరచి పోయినదని చెప్పుచు వస్తువు నిచ్చి సదీర్ఘకాయుఁడగు యువకుఁడు--నేపాలదేశస్థుఁ డాప్రదేశమునఁ బ్రత్యక్షమాయెను--వానిపేరు--“రఘునాథజీ.”—

రఘునాథజీని జగదీశుఁ డంతకుమున్ను రెండుపర్యాయములు చూచినాఁడు. పరిశోధకాగ్రగణ్యుఁడయిన అరిందమునితోఁ గూడ బొమ్మింగుహామునకుఁ బోవుచున్నపుడు--ఆతఁడు 18 వ నెంబరు గదికి పరిసరమున నిలువఁబడియున్నాఁడు___

"అగును--మంచు అధికముగనేయున్నది?" అని పలుకుచు జగదీశుఁడు తలను ద్రిప్పినాఁడు ... ఆసను కుమందు ఒంటిగానుండి 'మెత్రతేలు'ను గుఱించి యాలోచించి సాధ్యమయినంతవరకు రహస్యములను దెలిసికొనుటకు ప్రయత్నించుటయే యాతని సంకల్పము. కాని ఆసంకల్పమునకు విఘాతము కలిగినది. రఘునాథజీ బాతాఖానీ ప్రారంభింప మొదలిడినాఁడు--ఆతఁ డితర విషయములను గుఱించి ముచ్చటించి, ముచ్చటించి, చివఱ___

"జగదీశబాబూ! 18 వ నెంబరు గదిలో దారుణమగు హత్య జరిగినదఁట! నిజమేనా?" అని ప్రశ్నించినాఁడు___

ఆప్రశ్నకు జగదీశుఁ డులికిపడినాడు. అత్యంత నిగూఢముగా నుంచఁ బడిన యారహస్యము--ఇతనికెట్లు తెలిసినది! తనమిత్రుని హత్యలో--ఆనేపాళదేశస్థుని కేమయిన సంబంధమున్నదా? .. ఇట్లు లాతడుతలంచి క్షణకాలము మౌనమువహించినాడు. తరువాత రఘునాథజీనుద్దేశించి___

"అయ్యా! మీకెవరుచెప్పిరి? 18 వ గదిలో హత్యయని మీకెవరుచెప్పిరి." అని ప్రశ్నించినాడు.

నౌకలోనందఱు నట్లుచెప్పుకొనుచున్నారు--18 వ నెంబరు గదిలో బసచేసిన పెద్దమనుష్యుని కంఠము నులుమబడినట్లు--అందఱు గుసగుస

లాడుచున్నారు.......అని ప్రత్యుత్తరముగా నుడువుచు రఘునాథజీ యొక్క మందహాసమును వెలిఁబుచ్చెను......తరువాత మరల వాని చూడ్కులు జగదీశుని ముఖముపైనఁ బ్రసరించినవి 'ఈహత్యావిషయిక రహస్యమంతయు మాయముసేయుట కధికారులు ప్రయత్నించుచున్నా రఁట? నేనట్లు విని యుంటిని......ఎవ్వఁడో స్టీవర్డు ......ఒకఁడు...... నాతో చెప్పినాడు ...... 18 వ నెంబరుగది యిప్పుడు తాళమువేయఁ బడియున్నదట—అందులో బస చేయుటకు నిర్దేశించిన రెండవ ప్రయాణి కునకు వేఱొక గది ఈయబడినదట?'' అని యాతడనెను—

'అగును—ఆ రెండవప్రయాణికుడను నేనే!' అని జగదీశుడనెను.

'ఏమి! జగదీశబాబూ! మీరా! ...... మీరా!...... అయిన యెడల హత్యను గుఱించి మీరేమియుంగు దురన్నమాట?'

''నే నేమియు నెఱుంగను — మీరు చెప్పినట్లు — నాషివ్పు - మేటు — హత్యకావింపఁబడినాఁడని మాత్రము నేను తెలిసికొంటిని — రక్షకభటాధికారులు హత్యకాదనియు, మృతుఁడయిన యాతఁడు స్వయ ముగా స్వహస్తముతో పొడుచుకొని మరణించెననియు నిర్ణయించిరి..'' అని జగదీశుఁడు మాఱువలికినాడు. కొన్నినిముషములవఱ కిరువురును మౌనము వహించిరి......ఎవరి నోటినుండియు మాట వెలువడలేదు. ......తరువాత—రఘునాథజీ—జగదీశు నవలోకించి—

''జగదీశబాబూ! మీస్నేహితుఁడు—వంగదేశస్థుఁడు—భగత్ సింగు—డ్రాయింగ్ రూములో జోరుగా పేకాట నాడుచున్నాఁడు— మనము కూడ వెళ్ళి యాటనుజూతమా?'' అనియడిగెను. ''మంచిది— రండు—ఊఱకే కూరుచుండి చేయునదేమి?'' అని పలుకుచు జగదీశ బాబు—అతని వెంటడ్రాయింగు రూమునకుఁ బోయెను.

యస్. యస్. సాలవీను నౌకలోని డ్రాయింగు రూము మిక్కిలి విశాలముగనున్నది. ఆగదికి మధ్యగా నొక రౌండుటేబిలున్నది. దాని చుట్టును కుర్చీలున్నవి. వానిలో సుప్రసిద్ధ పరిశోధకాగ్రగణ్యుఁడగు నరిందమునితో ("భగత్ సింగు") గూడ నలుగురుపురుషు లుపవిష్టులై యుండిరి. అరిందమునకుఁ బ్రక్కనున్న కుర్చీలో స్థూలకాయుఁడగు జోను—తన సెకెండ్ సిగరెట్టులో నున్నాఁడు—వానికి ప్రక్కగా నొక మిలిటరీ ఆఫీసరు—"బౌజర్సు" అను పేరుగల క్రైస్తవయువకుఁ డుపవిష్టుఁడై యుండెను—వానిప్రక్క "రమేశచంద్" అని వ్యవహరింపఁ బడుచున్న డాక్టరు కలఁడు—వానిప్రక్క "శ్రీనివాసుఁడు"ను జమీం దారుఁ డున్నాఁడు!—వారందఱును గలిసి చతుర్ముఖపురాణమున కుప క్రమించిరి. జగదీశునకు వారిలో స్వల్పపరిచయము కున్నది. వారిలో సైనికోద్యోగియగు బౌజర్సు—ఉపకారవేతనము పుచ్చుకొని సిలోనులో స్థిరముగా వసింపఁబోవుచున్నాఁడు—డాక్టరు రమేశచంద్—శరీరారోగ్యము బాగు లేకపోవుటవలన సిలోనులోఁ గొన్నినెలలుండి తిరిగి రావలయునన్న తలంపుతో నక్కడకుఁ బోవుచున్నాఁడు—వారు చెప్పగా నాతఁ డాలకించినాఁడు.

జగదీశుఁడును — రఘునాథజీయు నటఁగల రెండు కుర్చీలలోఁ గూరుచుండిరి. ఆయువకులు బ్రిడ్జి ఆడుచుండగా వారు మిక్కిలి యుత్సాహముతోఁ బరికించుచుండిరి.

"భగతసింగుగారూ! పేకాటలో మీకు ప్రావీణ్యముతక్కువ!—ఏమయినను, మీకదృష్టము తక్కువ! మీరు నెగ్గలేరు!"—అను మాటలు రమేశచంద్రు నోటినుండి వెలువడినవి. ఆతఁ డరిందముదెసఁ గృత్రిమమందహాసమును బఱపుచు నవ్వినాఁడు.

"ఇదేమి అదృష్టమయ్యా?............ఏవిధముగా నయిన ప్రాణముపోవుటకు - ఉనుపోవక చేసుకొని యిది! సాధ్యమయినంత త్వరలోనే హిందూదేశమునుండి దాటవేసి సిలోనునకు బడవలయునని నాకున్నది"—అని శ్రీనివాసుండనెను—జమీందారుండు వయనున జగదీశునకు సమానుండు - వాసిముఖము ప్రసన్నముగను సంతోషకర మగుమందహాసముతోం గూడినదిగను ఉండెను.—

"ఏమో! ఈమాటకు దాటి తెన్నులు నాకుం గనంబడుటలేదు- భగతసింగూ! మీరును - జమీందారు శ్రీనివాసబాబును పోరాడు కొనుండు - ఎవరికిశక్తియున్న వారు నెగ్గుదురు"—అని బోసు - నోటిలో సిగరెట్టును పెదవులచివరకుం దెచ్చి, పలికెను.

"ఏమి? బోసుగారూ! మీరు కులాసాగా ఆడుచున్నారా?"! అని జమీందారుండు బోసు నుద్దేశించి ప్రశ్నించెను—

"ఇప్పుడే అన్నమాటేమిటి? నే నెప్పుడును—కులాసాగానే ఆడుచుందుదును......నాఘాన్సు లభించునంతకుం గనిపెట్టుకొని యుందును.........లభించిన తరువాత నిముషమాగను ..టక్కుమని కొట్టి తీరుదును!"—అని బోసు - చిఱునవ్వుతో ననెను.

"ఎర్రితేలువలె సమయము చిక్కినప్పుడు టక్కుమని ... కొడుదురా?"—అని యరీందముండు నవ్వుచు, బోసు ను... పలికెను—

"అగును - భగత్ సింగుబాబూ! అగును - మీరు గ్రహించితిరి!" అని యా...ండు మాఱుపలికెను—

అంతవఱకు నానంభాషణమును మౌనముతో వినుచున్న జగదీశునకు హృదయము భారమైనట్లు తోచినది — ప్రతివ్యక్తి నుండి వెలువడిన మాటలకును రెండర్థములున్నట్లు లాతఁడు గ్రహించినాఁడు — ప్రతివ్యక్తిని అనుమానించుట కవకాశమున్నట్లు తలంచుచున్నాఁడు.... అటఁగల వారందఱును గౌరవనీయులే! పెద్దమనుష్యులే! ధనవంతులే! పేరుప్రతిష్ఠలుగలవారే!......అయిన నిఁక వారిలో "నేర్పరి" వరు?......అదియే జగదీశుని యాలోచనము!

మరల వారందఱు ద్విగుణీకృతోత్సాహముతో పేకముక్కలను కలిపి ఆడుచున్నారు....చలనమువలన సాలవీనునౌక మిక్కిలివేగముతో పోవుచున్నట్లు విదితమగుచున్నది. అందున్న ప్రయాణికులలోఁ గొందఱు నిద్రించిరి—కొందఱు పాశ్చాత్యపద్ధతుల ననుసరించి డ్యాన్సునకుఁ గడంగిరి—కొందఱు ఆర్కెస్ట్రా నాలకించుచుండిరి......ఆగదిలో పేకాటమాత్రము జోరుగా సాగుచున్నది......పదినిముషములు గడచినవి — ఆకస్మికముగా నాగదిలోని విద్యుద్దీపము లాఱిపోయినవి!

"ఓయి భగవంతుఁడా! ఇదేమి? దీపముల కేమి తెగులు వచ్చినది?" అని యెలుగెత్తి జమీందారు శ్రీనివాసుఁ డఱచినాఁడు.

"బాబూ! ఉండుఁడు — స్విచ్ తెగిపోయినది. సరిచేయుచున్నాను—" అని పలుకుచు స్టీవర్డొకఁడాగదిలో బ్రవేశించి విద్యుద్దీపములను సవరించినాఁడు...కొన్ని నిముషములలోనే మరల గది యంతయు గాంతిమంతమయినది.—

"హల్లో! ఏమిటిది?"—అని యత్యంతాశ్చర్యము నభినయించుచు — తృళ్ళిపడి — బెంజిమన్ ప్రశ్నించినాఁడు — అనఁగా ఆబల్లకు

మధ్యగా నొక పేకముక్కపడియున్నది — దానిమీఁదఁ జక్కగా తీర్చి దిద్దఁబడినయక్షరముల నొక్కపర్యాయమందఱును జదివిరి. తెల్లఁబోయిరి! ఒకరిమొగమొకరు చూచుకొనఁ దొడంగిరి. దీపము లారిపోయి—గదియందంధకారము క్రమ్ముకొన్న త్రుటిలోను — విస్పష్టముగా నొక పేకముక్కమీఁదతీర్చిదిద్దినట్లు వ్రాయఁబడిన విషయమిది!

"నేనే ఎఱ్ఱతేలును! అరిందముఁడా! నిన్ను నే నెఱుంగుదును."

---

## అయిదవ ప్రకరణము.

---

జగదీశబాబు—ఆశ్చర్యాత్రములతో పేకముక్కమీఁదఁ గనఁబడుచున్న యావిచిత్ర సందేశమును జదివినాఁడు—అతఁ డద్దానిని దొలఁదొల్త విశ్వసింపలేక పోయినాఁడు—

"నేనే ఎఱ్ఱతేలును!"

"ఓయి భగవంతుఁడా! వీరిలో నెఱ్ఱతేలుగాఁ డెవ్వఁడు?" అని యనుకొని యాతఁడు తన దృక్కులను అందఱి మీఁదఁ బ్రసరింపఁ జేసినాఁడు.

జమీందారు శ్రీనివాసుఁడు—గద్గదస్వరముతోను, పరిపూర్ణోత్సాహముతోను—పేకముక్కమీఁద నున్న సందేశమును జదివినాఁడు—అందఱు వినునట్లుగా బయటికి చదివినాఁడు.

డాక్టరు రమేశుచంద్రు ముందు కొరగినాఁడు—రక్తమాంసములు లేక బక్కచిక్కినట్లున్న వాని నేత్రములా వ్రాతను బరికించి తృళ్ళి పడినవి—

"ఇదేమి? మహామాయవలెనున్నదే! దీని నెవరు వ్రాసిరి?... నేను మాత్రము వ్రాయలేదు—" అనుమాటలు వాని నోటినుండి వెలువడినవి.

"ఏమో! ఎవరు వ్రాసిరో! మిక్కిలి చిత్రముగానున్నది—" అని నుడువుచు బెంజిమన్—అందఱి మోముల నొకపరి పరికించినాఁడు. ఆతఁడంతటితో మిన్నకుండలేదు—

"అరిందముఁడా?......మనలో నరిందముఁ డెవ్వఁ డున్నాఁడు? ఆసేతుహిమాచలపర్యంతము తన యశశ్చంద్రికలను వ్యాపింపఁజేసిన సుప్రసిద్ధ పరిశోధకాగ్రగణ్యుఁ డిక్కడ కెప్పుడు వచ్చినాఁడు?"...... "అయ్యా! బెంజిమన్ గారూ! మీరు పొరఁబడుచున్నారు—నేనే అరిందముఁడను!"—అని నుడువుచు నరిందముఁడు మందహాస మొనరించి, ఆపేకముక్కను దన వ్రేళ్ళసందునఁ బట్టుకొని, విలాసపూర్వకముగా వ్రాత బల్లమీఁద టింపఁ దొడఁగెను.

"నేనే అరిందముఁడ" ననుమాట విద్యుల్లతవలె నొకపర్యాయ మందఱి హృదయములలో మెఱసినది—గదియంతయు నిశ్శబ్దమయినది—అందఱును మౌనమువహించిరి—ఒకరి ముఖలక్షణముల నొకరు చూచుచున్నారు.

"భగత్ సింగుగారూ! మీ రేమనుచున్నారు? అని స్థూలకాయుఁడగు బోసు—ఆశ్చర్యముతో కుర్చీలో కూలఁబడి—బొమముశీ

పాటుతోఁ బ్రశ్నించినాఁడు. "అయ్యా! బోసుగారూ! ఏమియు లేదు. నేను పత్తేదారుఁడనగు అరిందముఁడను!......ఈసందేశము నాచే నిర్దేశింపఁబడి వ్రాయఁబడినది."

జగదీశుఁడు—రెప్ప వేయకుండ నరిందముని ముఖమును బరికించుచున్నాఁడు. ఆతఁడు పై మాటలను—ప్రశాంత భావముతోను, ఉద్రేక రహితమగు కంఠస్వరముతోను, మందహాసపూర్వకముగను పలికినాఁడు.

"నేనే ఎఱ్ఱ తేలును!"

"ఎవరు?- ఈసమూహములో నొకఁడు—నామిత్రుని--గంగారామ్‌చెర్మనును హత్య గావించిన హంతకుఁడు--ఎఱ్ఱ తేలుగాఁడా?... వీరిలో ఇట్లు వ్రాసినవాఁ డెవ్వఁడు? దీపము లాఱిపోయిన క్షణకాలములో నిట్లు వ్రాయుటలో వాని యుద్దేశమేమి?... తా నిక్కడనే--అనగా పరిశోధకుని కట్టెదుటనే నిర్భయముగా నుంటినని తెలుపుటకా? ఇట్లు తనలోఁ దాను దలంచుచు జగదీశుఁ డటఁ గల వారిపైఁ దనదృక్కులను బఱపినాఁడు. వారందఱు నింతింతనరాని యాశ్చర్యముతో నరిందముని వీక్షించుచున్నారు.

"మీరు.........సుప్రసిద్ధపరిశోధకులగు నరిందములా?" అని మరల బోసు ప్రశ్నించినాఁడు—

"ఓయి భగవానుఁడా! ఇది యంతయు నొక నాటకమువలె నున్నదే!" అను మాటలు శ్రీనివాసుని నోటినుండి వెలువడినవి.

అరిందముఁడు—చిఱునవ్వు నవ్వుచుఁ దలయూచినాఁడు. "బోసుగారూ! పరిశోధకుఁడను నేనే! కొండొకకార్యార్థమై మాఱుపేరుతో

ప్రయాణము సాగించుచున్నాను — కాని యిప్పుడా రహస్యము చెప్పక తప్పనిసరి అయినది."

"ఓహో!.........అరిందముఁడా?.........మిక్కిలి చిత్రముగా నున్నదే?..............కాని యీ వ్రాఁత మిక్కిలి మాయగానున్నది... "నేనే! ఎర్రితేలును!" అనగా నర్థమేమి?"—అని సైనికోద్యోగి బెంజిమననెను. అరిందముఁ డొకపరి జగదీశుని బరికించినాఁడు—అతఁడు తెల్లబోయి చూచుచున్నట్లు గ్రహించినాఁడు.

"ఈసందేశ మెవరు వ్రాసిరో తెలిసికొనుటకు కుతూహలముగా నున్నది!" అని యరిందముఁడనెను.

"అగును—తెలిసికొనుటకు కుతూహలముగనే యుండును — కాని యిది వట్టివేళాకోళమునకు వ్రాయబడినట్లున్నది"—అని బెంజి మెన్ అనెను.

"కాదు — వేళాకోళముకాదు — నన్ను భయపెట్టుటకే వ్రాయఁబడినది. దీనిం జదివి నేను జడిసి, నాకార్యమునుండి విరమించు కొందునని తలంచియే హంతకుఁ డిట్లు వ్రాసినాఁడు."

"ఏమో! నే నేకర్మమెఱుంగను--" అని శ్రీనివాసుఁడనెను. "నాకుమాత్ర మేమి తెలియును?"—అని పలుకుచు బెంజిమెన్--బోసు వంకఁ దన చూడ్కులను బఱపెను.

"నేను నిర్దోషిని -- నమ్మండి బాబూ!.....ఎవ్వఁడయిన నిట్లు వ్రాయుటకు గల కారణముకూడ నాకు బోధపడుటలేదు"—అని నుడివి బోసు -- నేపాళదేశస్థుఁడగు రఘునాథజీని దిలకించెను.

"మీరెవ్వరు నేమియు నెఱుఁగకున్న మీయిదుగురిలో నొకఁడు వ్రాసియుండునని మీరనుమానింపవచ్చును .. నాకేగోల తెలియదు.." అని యాతడనెను.

ఇఁక ప్రత్యుత్తరమిచ్చుటకు జగదీశుఁడు మిగిలియున్నాడు. ఆతడు కూడ దన పనిని దాను ముగించెను—

"నేనేమియు నెఱుగను!"

మరల గదిలో మౌనముమలముకొన్నది — అందఱు నుచ్ఛ్వాస నిశ్వాసలనుగూడ బంధించి కూరుచుండిరి — ఎవాని నోటనుండియు మాట వెలువడుటలేదు!.........అటఁగల పెద్దమనుష్యులలో నొకఁడు తప్పక ఎర్రితేలుగాఁడై యుండును! వారిలోనొక్కఁడబద్ధమాడుచున్నాఁడనుట విదితము! ఎవరు? ఎవరు—ఎర్రితేలు?......

ఆసమయమున సాలపీనునొకప్రయాణమును విరమించి యాగినది — కాని జగదీశుని హృదయమునందలి సందేహములుమాత్ర మరి కట్టఁబడలేదు—"...ఈ అయిదుగురిలో నొకఁడు హంతకుడు!...... ఎవడు .....దీపములారిపోయినపుడు — ఆచీకటిలో వీరిలో నొకఁడావిషయమును వ్రాసినాడు ..దీపములను వెలిగించుటకు వచ్చిన స్త్రీవర్దుచలనమాత్ర మీపని జరిగియుండలేదు—"అని యనుకొనుచు జగదీశుఁడు వారినందఱను బరికింపదొడగెను.

నేపాళదేశస్థుడు — చిఱునవ్వుతో — బోసును దిలకించినాఁడు— బోసు—జమీందారుని దిలకించినాడు—రమేశచంద్రు అరిందము నుద్దేశించి—"నాకీవ్యవహారమేమియు బోధపడుటలేదు—......ఎవడు దీనిని వ్రాసియుండునో?"

“అదే పరిష్కరింపబడవలసినసమస్య!” అని చిఱునవ్వుతో— పత్రేదారుడు మాటుపలికెను. ఆతడంతతో మిన్నకుండలేదు.

“మీరందఱు పెద్దమనుష్యులు — గౌరవనీయులు! “నేను వ్రాయలేదని—నేను వ్రాయలేదని మీరందఱుగూడ నుకువుచున్నారు- మీలో నెవ్వరును వ్రాయనియెడల దీపములను వెలిగించుటకు వచ్చిన వాడెవ్వడో వ్రాసియుండవచ్చును—” అని పలుకుచు నరీందముడు— జగదీశుని ముఖము బరికించెను — ఆమాట తన హృదయాంతర్భాగము నుండి వచ్చినది కాదని తెలుపుటకే యాతడు జగదీశు నవలోకించి నాడు! జగదీశుడుకూడ—“గ్రహించితి” నన్నట్లు మందహాస మొన రించినాడు.

అప్పటికి గదిలో నున్న గడియారమొంటిగంట కొట్టినది! ఆటను ముగింప వలయునని యందఱు ననుకొనిరి — సైనికోద్యోగియగు బెంజ మన్ లేచి నిలువబడి—

“అరీందముబాబూ! మీరు మాఱుపేరుతోనే వ్యవహరింప వచ్చును — మిమ్ములను భగవత్ సింగనియే పిలుచుచుండెదము— మీరహస్యముగు ప్త పఱుపబడునని మీరు గట్టిగా నమ్ముడు” అనెను. “అగునగును — తప్పక అట్లు జరుగవలయును—” అని జగదీశుడనెను.

“మీసదభిప్రాయమునకు మీకు నేను కృతజ్ఞుడను. ఒకవేళ మీరు—నామాఱుపేరును దాచకున్నను, దానివలననాకు ప్రమాద మేమియులేదు—” అని ప్రత్యుత్తరముగా పలుకుచు నరీందముడు— జగదీశునితోగూడ నాగదినివిడిచి — వసారాలో బ్రవేశించెను...... ముందుగా నాతడు సంభాషణకు పక్రమించునేమో యని జగదీశుడను

కొనెను......కాని యట్లుజరుగలేదు. అందువలన దానే యారంభించి నాడు.

"!బాబూ! ఆవ్రాతయెవరిది?"

"ఏమో! నేనేమిచెప్పగలను? ఎర్రతేలుగా దేవ్రాసియుండ వచ్చును......లేక మఱొకడు వ్రాసియుండవచ్చును......మనతోనున్న అయిదుగురిలోనొకడు వ్రాసియుండవచ్చును...లేకపోయిన మొదల దీప ములాఱిపోయినపుడా చీకటినమయములో గదిలోనికెవ్వఁడయినవచ్చి వ్రాసియుండవచ్చును .....మొత్తముమీఁదనొకటి మాత్రమువిస్పష్టము. ఎర్రితేలుగాడునన్ను కనిపెట్టినాడు—నేనెందులకీ నౌకమీఁదనుంటినో పూర్తిగా గ్రహించినాడు—"

"అరీందముబాబూ! ఎవరు? ఎర్రతేలెవరు? నీవుగ్రహింపలేదా? బెంజమనా?......బోసా?......శ్రీనివాసా?...... రఘునాధజీయా!...?

"జగదీశ్! ఆప్రశ్నకు ప్రత్యుత్తరముచెప్పుట కిప్పుడువీలు లేదు......తగినక్లూ మనకిప్పుడుదొరకలేదు—కాని వారినయిదుగురను నొకకంటగనిపెట్టుచుండుట మంచిది."

ఈవిధముగాపలికి అరీందముడుమిన్నకుండెను— సముద్రముమీఁద నుండి వచ్చుచున్న మంచు గాఢముగా నౌకనుగప్పివేయుచున్నది. వెలుగు చున్న విద్యుద్దీపములుకూడ నామంచువలన నిరర్థకములయినది— ఆసమ యమున నరీందమునకు తలమీఁదనున్న స్మోకింగ్ చాపల్ కదనద్దునిపించి నది. అదేమైయుండునోయని జగదీశుడుమీఁదికి దన దృక్కులనుబఱపి నాడు—పలుపుటేతడవుగా తృళిపడినాడు—అతనిశరీరమా పాదమస్తకము కంపించిపోయినది.

“బాబూ! అరిందము బాబూ! ..............చూడు... చూడు!” అని యాతడు మిన్నకుండెను—

ఆమాటలకదిరిపడుచు నరిందముఁడు తన కన్నులను పైకెత్తి చూచినాఁడు. అతఁ డాత్రముతో—

“అఁ — అఁ — అదేమి? జగదీశబాబూ! నిజముగా నొక దయ్యమువలెనున్న దే?......ఎఱ్ఱ తేలుగాడిచేత హత్యకావింపబడిన నిర్భాగ్యుడు—గంగారామ్ చెర్మన్ యొక్క రూపమువలెనున్న దే?” అనెను.

“అగును — దయ్యమే — బాబూ! దయ్యమే!”

ఆస్వరూపమొకపరి — చిమ్నీగుండా వారిని దిలకించి యదృశ్యమయినది. అసహ్యాకరము — భయంకరమునగు నామూర్తిని జూచి ఆయిరువురును భయపడిరి. కంపించిరి—ఏమది? నిజముగా నొకభూతమై యుండునా?............!

“జగదీశబాబూ! నాకు దయ్యముల ఉనికియందు నమ్మకము లేదు...అటులని మనలను భయపెట్టుటకెవ్వడో — ఆయాకారముతో మనకు గనబడి యంతలోనే మాయమైయుండునని తలంచుటకుగూడ వీలులేకున్నది...ఇది పరిహాసమని నే ననుకొనను”

“అరిందముబాబూ! ఉండుము. నేను నౌకోపరిభాగమునకు పోయి యక్కడ ఎవడయిన నున్నాడేమో చూచివచ్చెదను—” అని నుడువుచు జగదీశుడు, అరిందముని సమ్మతినయిన బడయకుండగనే చరచర ఆవలకు నడిచిపోయినాడు—

అరిందమున కేమిచేయుటకును దోచలేదు...ఈ భూతమేమి! నిజముగానిది. భూతమా! ప్రపంచములో భూతములున్నవా! .........
అని పరిపరి విధముల నాలోచించుచు నాతడు జగదీశుడు వెడలినదెస జూచుచుండెను......అట్లు రమారమి పదునైదునిముసములు గడచినవి.. జగదీశుడింకను వచ్చుటలేదు......ఏకారణముచేతనో ఆతనికాత్ర మధికమయినది — హృదయము త్వరితగతిని గొట్టుకొన దొడంగినది "జగదీశ్! జగదీశ్!......అని గొంతెత్తి రెండు పర్యాయములు పిలిచినాడు- ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షించినాడు...కాని అది కొఱతవడినది— ప్రత్యుత్తరము వినబడలేదు — ఆతని యాతురత మఱింత హెచ్చినది. వడిగామెట్లనెక్కి నౌకయొక్క ఉపరిభాగమునకు బోయినాడు — కాని మంచుసాంద్రముగ నల్లలడలనలముకొనుటవలన మన్నుమిన్ను కనబడుట లేదు — మరలగొంతెత్తి—

"జగదీశ్! జగదీశ్!—అని యరిందముడు పిలిచినాడు — ఈపర్యాయముకూడ బ్రత్యుత్తరమురాలేదు. తోడనే ఆతడు — అంగీజేబునందున్న టార్చిలైటును బయటకు దీసి బటనునొక్కినాడు — ఇంచుకంతవెలుగువలన ముందునకు నాలుగడుగులువేసినాడు — అకస్మికముగా నిలువబడిపోయినాడు! కారణమేమి? ఆతనిపాదముల కేదియో మెత్తగా తగిలినది? టార్చినిదగ్గఱగా ఫోకస్‌చేయుచు నత్యంతాతృముతో నరిందముడు తనకట్టెదుటనున్న పదార్థమునుగాంచినాడు—అది యేమి? వస్తువా? కాదు కాదు! ప్రాణాపాయస్థితిలోబడియున్న జగదీశుడు! కంఠమున కొక సిల్కుగుడ్డ యురిపోయుటవలన గ్రుడ్లుతేలవేసి, ఊపిరి ఆడకపోవుటవలన నుక్కిరిబిక్కిరయి......క్షణములో నీప్రపంచమును విడుచుటకు సిద్ధముగానున్న జగదీశుడు! - - - - ఇంతకు నరిందముడు సమయమునకక్కడ బ్రత్యక్షమయినాడు! ఒకనిముసమాలస్య

మయిన యెనల గాఢ్యము మించియుండెడి —ఆలస్యమొనరింపక — తన యంగీజేబులోని మడతచాకును బయటకుదీసి, విప్పి జగదీశుని కంఠము నకు ముడివెట్టబడిన గుడ్డను కత్తిరించినాడు — జగదీశుడు తెప్పరిల్లు టకు గొంతసేపుపట్టును —— —— అరిందముడు చూచుచు మిన్నకుం డెను — ఆతని మెదడులో నానమయమున లెక్కలేనన్ని యాలోచనలు బయలుదేఱినవి___

"ఉరిపోసి మనుజునిచంపుపద్ధతి మిక్కిలిగా తూర్పుదేశములందా చరణలోనున్నది —పీపిల్సుపార్కులో గిరిధరలాల్ సైతమిట్టి గుడ్డతోనే కంఠమున నురిపోయబడి హత్యకావింపబడినాడు .... ఆహంతకుడు మంచువలన గలిగినచీకటిలో జగదీశునిజూచి నేనేయనితలంచి పొరబడి యట్లుచేసియుండును—అగును — ఆమాటవాస్తవము కాని యెడల జగ దీశునకీ గతి యెందులకు పట్టవలయును? ...... రఘునాథజీ తూర్పు దేశస్థుడు! ప్రాయశః ఆతడే ఈతడై యుండునా? ఇట్లు తలంచుచు— మెల్లగా జగదీశుని దన గదిలోనికి గొనిపోయి యటవిశ్రమింపజేసి, తాను మరల నౌకోపరిభాగమునకు వచ్చినాడు. సరిగా నప్పుడాతనికామంచులో నస్పష్టముగానొక వ్యక్తిగోచరించినాడు—జగదీశుడుచేతనున్న టార్చిని ఆవ్యక్తిదెస కేంద్రీకరింప జేసినాడు ఆతడెవరు? జమీందారు శ్రీని వాసుడు!

"అరిందముబాబూ! ...... గాలి కొట్టుకొనునట్లు నడచుచూడు చున్నాను...... మీరేమిసేయుచున్నారు! ..... ఎవరితేలునుబట్టుకొను టకు ప్రయత్నించుచున్నారా! అని యరిందముని బ్రశ్నించినాడు!

## ఆరవ ప్రకరణము.

జమీందారు శ్రీనివాసుని ముఖముమీద మందహాసము తాండవించుచునేయున్నది — అహాసము తనచూపులను సూటిగా..అతని ముఖముమీదికి గురిచేసినాడు—

"శ్రీనివాసబాబూ! నిజము నిలుకడమీదగాని తేలదు -- ఎఱ్ఱ తేలును బట్టుకొనుట సామాన్యకార్యమా? . . . కాదుకాదు—సమయమురావలయును . . . కాని, చిన్నమనవి! మీకు భూతములయందు నమ్మకమున్నదా? అనగా దయ్యములున్నవని విశ్వసింతురా?

"ఏమి? దయ్యములా? . . . అరిందముబాబూ ! మీప్రశ్న నాకర్థమగుటలేదు—"

"అర్థమగుటకేమున్నది?—ఈనౌకమీద భూతములున్నవి— క్షణకాలముక్రిందట మీరు వానిజూచియేయుందురు!

"ఏమి? ఎక్కడ? ఈనౌకమీదనా? అరిందముబాబూ! ప్రకృతి విరుద్ధములగు సంఘటనములను నేను నమ్మను -- అటులయ్యు నీమాట మీనోటినుండి వినవచ్చుటచేత నేను నమ్మక తప్పదుకదా? భూతములీనౌకమీదనేయున్నవా? నేను చూడలేదు -- గాలికొఱకిప్పుడిప్పుడే నేనిక్కడకువచ్చితిని నేనేమియు జూడలేదు—"

"ఓహో! మీరిప్పుడే యిక్కడకు వచ్చితిరా?" అని చిఱునవ్వుతో నరిందముడు—జమీందారుని ప్రశ్నించినాడు -- అంగీకారసూచక

ముగా నౌనన్నట్లు జమీందారు శ్రీనివాసుడు తలద్రిప్పినాడు. కొన్ని నిముషములవఱ కిరువురును మౌనముద్రనే వహించిరి—

“అరిందముబాబూ!......మంచు కొంచెము కొంచెముగా తగ్గుచున్నది — మనము త్వరలో హాకీంగాటు చేరుకొనవలయును— ఆలస్యము సేయగూడదు — హాకీంగాటులో నొక మూడుపూటలు మాత్రమే యాగును — బాబూ! మీరిదివఱలో హాకీంఘాటును జూచితిరా!”

“ఆ — చూడకేమి! ఒక రహస్యభేదనకార్యములో బ్రవేశించితిని — ప్రతిపక్షుల పదునుకత్తి హాకీంఘాటులోనే నా మెడను త్తరింప బోయినది — అదృష్టవశమున దప్పించుకొని బయలు బడితిని.”

“పాపము!......ఇంతకు అరిందముబాబూ! మీవృత్తిఆపాయకరమయినది—వారికి మీరడ్డు తగులుచుండుటచేత -- మీకొక్కొక్కప్పుడు కష్టములపాలగు చుందురు -- అంతేనా!” అని మందహాస పూర్వకముగా శ్రీనివాసు డరిందముని బ్రశ్నించినాడు.

“శ్రీనివాసబాబూ! మీరు పొరబడుచున్నారు -- మాకు శత్రువులెక్కువ అను మాట వాస్తవమే! కాని యితరుల కార్యములకు మేమాటంకములను గల్పింపము. ఇతరులే — బలవంతముగా మమ్ము — తమకార్యములలో బ్రవేశించునట్లు చేయుదురు......మావృత్తి అపాయకరమే అయినదయ్యు మిక్కిలి యుత్సాహముం గొల్పుచుండును — మాయలో మాయ — నాటకములో నంతర్నాటకము — ఎత్తుపై యెత్తు — ఈ విధముగానుండి -- నీ..నా. నేనా అను పోటీతో నొకరి బలాబలములొ కరెఱుంగుట కవకాశమొసంగుచు నుండును.”

ఆజవాబునకు జమీందారుడు చిఱునవ్వునవ్వినాడు—సమీపమందున్న గదినుండి గడియారము టంగుటంగున రెండు గంటలుకొట్టినది.

అరిందముబాబూ! రెండుగంటలు కావచ్చినది. ఇక నేను నా గదిలోనికిపోయి నిద్రింతును సెలవా? అని యడిగినాడు.

మంచిది దయసేయుడని యరిందముడు ప్రత్యుత్తరమిచ్చినాడు.

శ్రీనివాసుడు వడిగా మెట్లనుదిగి మేడయొక్క రెండవఅంతస్తునకు బోవసాగినాడు కొన్ని మెట్లు దిగిన తరువాత మరలమోమెత్తి అరిందముని జూచి—

"అరిందముబాబూ!...అన్నట్లులడుగ మరచితిని — ఎవ్వరతేలెవరో మీరు కనిపెట్టితిరా? పట్టుకొంటిరా?" అని యడిగినాడు.

"లేదు—లేదు. ఆకార్యమంత సులభమయినదా? విషజంతువులతో తొందరపడరాదు కదా!" యని నవ్వుచు నరిందముడు బదులుచెప్పెను—శ్రీనివాసుడు మెట్లను దిగి వెళ్ళిపోయినాడు.

అరిందమునకు మాత్రము హృదయములో ప్రశాంతతలేదు—మాటిమాటికిని—ఆభూతమే మనోవీధిని బ్రతిఫలించుచున్నది—

ఆముఖము కృత్రిమమయినది — మానవనిర్మితమయినది—దాని నెవరు తయారుచేసిరి? ఎందుకు తయారుచేసిరి?" ఇట్లు ప్రశ్నించుకొనుచు నరిందము డాప్రదేశమును విడిచి 13 వ, నెంబరు గదికి ప్రక్కగా (సమీపమున) నున్న తనగదిలోనికి బోయినాడు—గదికీవల నిలువబడి తన యంగీజేబులోని పేకముక్కను బయటకు దీసి, అందు వ్రాయబడియున్న సందేశము నొకతూరి చదివినాడు—

"నేనే ఎఱ్ఱ తేలును!...అరిందముడా! నేను నిన్ను ఎఱుంగుదును!"

పెనిసిలు చేతవ్రాయబడినను, ఆవ్రాత హంతకుని బట్టుకొను టలో నొకప్పుడు తనకు సహాయ మొనరింపవచ్చునని యాతఁడను కొనెను.

"ఎఱ్ఱతేలూ! తొందరపడవలదు—నేను నిన్ను దప్పకపట్టి తీర దను." అనుమాట లప్రయత్నముగా ఆతని నోటినుండి వెలువడెను—

అరిందముడు గదిలో బ్రవేశించినాడు—అం దున్న జగదీశబా బింకను నిద్రింపలేదు—తెప్పరిల్లలేదు—ఇటు నటు నాయాసముతో నడయా డుచున్నాడు—అరిందముని జూచుటతోనే, అమితోత్సాహముతో—

"బాబూ! కాయా? పండా?" అని ప్రశ్నించినాడు ఆప్రశ్న యందలి యర్థము అరిందమునకు బోధపడినది—

"జగదీశబాబూ! మనమిత్రు డెఱ్ఱతేలుగాడు—మనకు 'క్లూ' దొరకనీయలేదు—నీకంఠమున నురిపోసినప్పు డీసిల్కుగుడ్డ మాత్రము దొరకినది." అని నుడువుచు నాతడు తన యంగీజేబులోని సిల్కు గుడ్డను దీసి చూపించెను— దెబ్బతిన్న బెబ్బులివలె నరిందముడు మండి పడినాడు—పటపట పండ్లు గీటుచు—

"అరిందము బాబూ!...ఆదుర్మార్గుఁ డెప్పుడయిన నాచేతులలో బడిన యెడల నాకసితీర్చుకొందును...అన్నట్లు—ఆదయ్యము ముఖము మాటయేమయినది? మీరేమయిన గ్రహించినారా?"

"నేను కొంతవఱకు గ్రహించినట్లే భావించుచున్నాను. కాని, దానిని మాత్ర మిప్పుడు బయటబెట్టను—ఆతుచ్ఛు డీవిథముగా మన

లను భయపెట్టలేదు—ఈమాత్రమునకే మనము భయపడి నౌకను విడిచి పోవువారము కాము—"

"బాబూ! అతడింకను నౌకమీదనే యుండుటకు కారణ మేమి?"!

"అదియే యూహింపవలసియున్నది— కేవలము గంగారామ్ చెర్మకాను హత్యకావించుటకే యీనౌకమీది కాతడు వచ్చియుండడు. అటులయిన యెడల వాని హత్యానంతరము దీని నాతడు విడిచిపోవం సినదే కదా! ఈనౌకలో నభేద్యరహస్యమొందున్నది—ఈనౌకలో వానికి గావలసిన వస్తువేదియోయున్నది — అందుచేతనే — అతఁడు దీనిని విడిచి పోవుటలేదు—కానియిక—ఈప్రయాణము ముగియు లోపున వానింబట్టి తీరుదము— జగదీశబాబూ! వేఱొక సంగతి! నౌకమీదనే నిప్పుడు జమీందారు శ్రీనివాసుని జూచితిని—"

ఆమాటకు జగదీశుఁ డదిరిపడినాఁడు—ఆతురతతో—

"ఏమి? శ్రీనివాసుఁడా?...అరిందముబాబూ! మీయభిప్రాయ మేమి? అతఁడే యెర్రితేలయియుండునా?"

"నేనట్లు చెప్పను—జమీందారంతటి మూర్ఖుడుకాడు...... అతఁడు చల్లగాలికై విహరించుచున్నాడట!...కాని, అతడా అయిదు గురిలో నొకడుగదా! మనము కొంచెము జాగ్రత్తగా కనిపెట్టుచుండ వలయును"

అరిందముడు మఱికొన్ని నిముషములవఱకు జగదీశునితో మాట లాడి గదిని విడిచి మరల వసారాలో బ్రవేశించినాడు — హృదయము దీర్ఘాలోచనానిమగ్నమైయుండుటవలన నాతడు నిద్రింపలేదు — అంగీ

జేబునుండి యొకచుట్టను బయటకుదీసి అంటించి, కాల్చుచు వసారాలో నినుపయూచనానుకొని నిలువబడినాఁడు — ఆలోచన మభినయించు చున్నాఁడు — 13 వ నెంబరుగది యాతనికి గనుపించుచునేయున్నది — ఆచీకటిలో దాళము వేయబడినట్లు తలంపబడిన యా 13 వ నెంబరు గదినుండి — అనగా గంగారామ్‌చెర్మను హత్యకావింపబడిన యాగది నుండి — యొక వ్యక్తి వెలికివచ్చుచుండుటగాంచి యరీందముడు స్తంభీభూతచిత్తుడాయెను!

---

ఏడవ ప్రకరణము.

---

జగదీశుడు ఆకస్మికముగా నిద్రనుండి తృళ్ళిపడిలేచినాడు—ఆతడు గతరాత్రిశయనించియున్న యాగదియంతయు నిష్పంధకారబంధురమై యున్నది — గాఢనిద్రాపరవశుండై యున్న తాను — హఠాత్తుగా మేల్కొనుటకు కారణమేమి? ఆతడాలోచింపసాగెను — గదిలోని విద్యుద్దీపము లొక్కపర్యాయముగా నార్పివేయబడుటకుగల కారణముసైత ము వానికవగతమయినది కాదు—ఆతడేమిచేయుటకును దోచక ఆతృ ముతో నిటునటు చూడసాగెను. కాని యాచీకటిలో నాతనికేమి కన బడును? పదముల చప్పుడు స్పష్టముగావినబడుటవలన నెవ్వడో యా గదిలో బ్రవేశించినాడని జగదీశుడు గ్రహించినాడు — ఆకస్మికముగా నాతని కట్టెదుట నొకవస్తువు తళతళ మెరసినది — అదేమి? ఒకపిస్తోలు! ఎక్కడున్నది? ఆతని కంఠమునకు సూటిగా గురిచేయబడినది.

"జగదీశ్! నీయవసరము మాకిప్పుడు కావలసివచ్చినది — అను మాటలు జగదీశుని చెవులందుబడినవి—ఆకంఠమతికఠోరముగానున్నది.

జగదీశుఁడు నిశ్చేష్టుఁడై — కదలక, మెదలక, అట్లే వెనుకకు తగ్గియుండెను—అంతలో వేరొకడెవ్వడో గోడనున్న ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కినాడు — ఎక్కడిచీకటులక్కడ అంతరించినవి—కాంతిపుంజములు నల్గడల బ్రసరించినవి—జగదీశు డంగీజేబునుండి పిస్తోలును బయటకు దీసి, ప్రేల్చినాడు. కాని యది యాతని మ్రోలనున్నవానికి దగులలేదు. ఆతని యెదుటనున్న కఠోరస్వరమొనరించినవాడు — గంభీరాకృతిగల వాడు—ఎవ్వడో కాదు—అరిందమునిస్టీవర్డు—కరీమ్! వాని వెనుక మఱి యిరువురు క్రైస్తవయువకులు—భయంకరాకారులు—చేతులలో పిస్తోళ్ళనుబట్టుకొని నిలువబడియుండిరి.

"ఏమి? మా వెంట మాఱుమాటాడకుండ, శాంతముగా వత్తువా?" అని కరీము మరల జగదీశు నుద్దేశించి ప్రశ్నించినాడు. పాపము! జగదీశు డేమి చేయగలడు?...తా నొక్కడు! ప్రతిపక్షులు ముగ్గురు!—వారితో బెనగులాడుటకయిన నవకాశములేదు!—వా రాయుధప్రాణులై యున్నారు. వారితో పోరునకుఁ దలకొనుట మృత్యువును గోరి తెచ్చుకొనుటయే కదా! ఆతడు మౌనము వహించినాడు— ఆదుర్మార్గులు ముగ్గురు నాతనిం బట్టుకొని నౌకయొక్క ఉపరిభాగము నందలి వసారాలోనికి గొంపోయిరి.

" మనమిప్పుడెక్కడకు పోవుచున్నాము?"—అని జగదీశు డుద్రేకపూర్వకముగా ప్రశ్నించినాడు.

"ఎక్కడకా? నౌకాధిపతిని సందర్శించుటకు—జగదీశ్! ఈ నౌకకు అధిపతియయిన క్రొత్త కెప్టెనును జూచుటకు—తెలిసినదా?"—

అని కరీముగాడనెను. అట్లుపలుకుచు—ఆవసారాయందున్న యొక పెద్ద గది తలుపును కరీముగాడు తెరచినాడు – జగదీశుని ముందునకు గెంటి నాడు – ఖైదీకిరుప్రక్కల దుపాకులతో నిలువబడురక్షకభటులవలె నాతని కిరుప్రక్కలయందు బిస్తోళ్ళను బట్టుకొనియున్న క్రైస్తవయువకు లిరువురు నిలువబడియేయున్నారు—

జగదీశుడు—నిస్సహాయుడయ్యు మానసికోద్రేకము నరికట్ట లేక—వెచ్చనిట్టూర్పులం బుచ్చుచు, గదిలో నల్గదలకు దనదృక్కులను బ్రసరించినాడు—కాని, సాలవీను నౌకాధిపతి మోహనమెహతా తొలు దొల్త నాతని కగపడలేదు—ఆతడు ఖైదీయై నౌకయొక్క రెండవ అంతస్తులోనున్న గదిలోబడి మూల్గుచున్నాడని మా పాఠకుల కీయవసర మున జెప్పుటముఖ్యము—ఓడకెప్టెను సాధారణముగా కూరుచుండు కుర్చీకి ప్రక్కగానున్న కుర్చీలో నరిందము డుపవిష్టుడై యుండెను – గురి చేయబడిన పిస్తోళ్ళను జేతబట్టుకొని నలుగురు క్రైస్తవయువకులు ఆతని చుట్టును గావలికాయుచున్నారు! అరిందముడు—గదిలోనికి నెట్టబడిన జగదీశు నవలోకించి యొక మందహాస మొనరించినాడు—

"ఈమాయయేమిటి?" అని జగదీశుడు సింహగర్జన మొనరిం చుచు ప్రశ్నించినాడు.

సరిగా నాసమయమునకు బ్రక్కగదిలోనుండి యిట్లు ప్రత్యుత్త రము వినవచ్చినది.

"ఓహో! జగదీశబాబూ!...తుదకు నీవిక్కడకు వచ్చితివా?"

ఆపలుకు లెవ్వని నోటినుండి వెలువడినవో తెలిసికొనుటకు జగదీశబాబు మోమెత్తినాడు—అంతలో నాతనిముందల నైనికోద్యోగి. బెంజిమెన్ ప్రత్యక్షమాయెను!

జగదీశు డాశ్చర్యపడినాడు. విస్మయమందినాడు. తానంతవఱకు సైనికోద్యోగిగా భావించి గౌరవించుచున్న పెద్దమనుష్యుడు తనకు ప్రబల విరోధి! అహా! చిత్రము!

"జగదీశబాబూ! నేనింక దాచుట యెందులకు? నేనెవ్వడనో కాను నేనే యెర్రతేలును!" అని నుడివి! బెంజిమెన్—ఒకపరి వెడనవ్వు నవ్వినాడు. ఆతడంతతో నాగలేదు—అరిందముడు మున్నగువారు మా చేతులలో నీయోడమీద ఖైదీలయిరి! వారితోబాటు—నీవును మా ఖైదీవే! ...... ఈనౌక నా యధీనమని గ్రహింపుము—దీనికన్నివైపులను మరతుపాకుల మర్పఁబడియున్నవి—కనుక మీరందఱు మాకు విశేషప్రయాసము నొసగకుండగనే స్వాధీనులగుట మంచిది. మీరు మమ్మెదిరింపఁజూచినను మీ ప్రయత్నము నెగ్గదని తెలిసికొనుడు.

"నీవు! అని జగదీశుడేదియో చెప్పబోయెను. కాని యంతలోనే బెంజిమెన్ యొక్క భయంకర కఠోరస్వరమాతని నరికట్టినది.

"ఆ నేనే!"

జగదీశుడు నోటమాటలేకుండ నిలువబడినాడు. పండ్లుపటపట గొఱుకుచు కన్నులనుండి విస్ఫులింగములు రాల్చుచున్నాడు.

"ఆహా! బెంజిమెనా? ఎర్రతేలు! నేను కలలోనయిన వీనిననుమానింపలేదే!" అని తనలో దాననుకొన్నాడు. ప్రభుత్వమువారి సైనికశాఖలోఁ బనిచేసి యుపకారవేతనము స్వీకరించిన యుద్యోగస్థుడు; తుదకీవిధముగా మాఱినాడా? అని సందేహించుచు నాతఁ డరిందమునవలోకించి—

"అరిందముబాబూ! నీవీరహస్యము నెఱుంగుదువా?" అని యడిగినాడు.

"జగదీశ్! నేను కొన్నిదినములకు పూర్వమే తెలిసికొంటిని"— అని యరిందముడు బదులు చెప్పినాడు—తోడనే జగదీశునకు కథ యంతయు బోధపడినది. బెంజిమెనే యెర్రతేలని యెఱింగి తాను వానిని గుఱుతించినట్లు తెలియకుండనుండుటకై వానిసహాయమునుగోరి, వాని కన్నులలో దుమ్ముచల్లిన ప్రజ్ఞాధురీణు డరిందముడని గ్రహించినాడు. అతడు మరల నరిందముని దెస దన చూడ్కులను బ్రసరింపజేసినాడు—

"జగదీశబాబూ! నీవు నన్ను క్షమింపవలయును — నేనెఱింగిన రహస్యమును నీకు వెలిబుచ్చకుండుటకు, దగినకారణమున్నది—ఈ యెర్రతేలుగాడికి తగినంత యవకాశమిచ్చుటయే నాతలంపు! తా నురి పోసికొనుత్రాటిని దానే తెచ్చుకొనవలయుననియు—తన గోతిని దానే త్రవ్వుకొనవలయుననియు నే నూహించితిని."

"అరిందముబాబూ!......నీయూహలన్నియు గంగపాలయినవి కదా! .....తుదకు నేనే జయించితిని! ఏమందువు?"—అని, అట్టహాస పూర్వకముగా బెంజిమెన్ పలికెను.

"నీవు జయించినట్లే కనబడును......ఇంతకు నీయెత్తు లెట్టివి?" అని అరిందము డెర్రతేలుగాడిని బ్రశ్నించినాడు.

"నేనీ నౌకను— ముబారాద్వీపము నొద్దకు దీసికొనివెళ్ళుదును. ఆప్రదేశమును జేరబోవులోపున ఇందున్న యొకవస్తువును—నాకు కావలసినవస్తువులును—వెదకి సంగ్రహించుకొందును—ఆవస్తువెట్టిదో మాత్ర మునీకు జెప్పను—తరువాత నేను నాభృత్యులతోను, పరిజనులతోను నౌకనుండి సురక్షితముగా క్రిందకు దిగుదుము—పిమ్మట మీప్రాణము లను మీకు దక్కనీయము — మిమ్ముల నందఱను నౌకతో గూడ సముద్రజలములలో ముంచివేయుదుము,"

“ఎఱ్ఱతేలూ! నీవేవస్తువుకొఱకు వెదకుచున్నావో నాకు చెప్పనక్కఱలేదు—నే నీవఱకే గ్రహించితిని. ‘రాబర్టసిసిల్‌రో’—అను వాఁడు దొంగలనాయకుఁడు—వాఁ డెప్పుడును దపాలాబంగ్లను దోచుకొనెడు వాఁడు—హిందూదేశము—అమెరికా—ఆఫ్రికా—మున్నగు ఖండములలో నున్న ధనికులను సంబాధించిన డాక్యుమెంట్లు—దస్తావేజులు—ఉత్తరములు—మొదలగునవి అనేకము లాతఁడు దొంగిలించి యొకసంచిలో దాచినాఁడు. వాని నాధారముగాఁ గొని వాఁడు కోట్లకొలఁది రూప్యములను సంపాదించినాఁడు. నీ విప్పు డాసంచి కొఱకుఁ బ్రయత్నించుచున్నావు—” అని నరేంద్రుఁ డనెను.

జగదీశుఁ డత్యంతాశ్చర్యముతో నరేంద్రుని బరికింపసాగెను—ఆతఁ డీకథ నెప్పుడు తెలిసికొనినాఁడు?

ఎఱ్ఱతేలు కూడ విస్మయాశ్చర్యముతో బత్తేదారుని జూచుచుండెను.

“జగదీశబాబూ! ఈరహస్యమంతయు నాకెట్లు తెలిసినదని నీ వాశ్చర్యపడుచున్నావు కాఁబోలును! గతరాత్రి నేను హాస్పిటలునకు వెళ్ళితిని—అక్కడ నాకు—ఇదివఱ కీనౌకలో నొకటి రెండుపర్యాయములు మనకు దయ్యమువలెఁ గనఁబడిన యువకుఁడు చెప్పినాఁడు—ఆతనికి ప్రాణాపాయము సంభవింపదు. త్వరలోనే ఆరోగ్యమును పొందఁగలఁడు—” అని నరేంద్రుఁ డనెను.

ఆమాటలాలకించుసరికి—బెంజిమెనునకు తలతిరుగ సాగినది. ఆతఁ డరేంద్రునవలోకించి—“ఏమి! దయ్యమువలెమీకుఁ గనఁబడిన యువకుఁ డా?...ఆతఁడెవఁడు!” అని ప్రశ్నించినాఁడు. “ఆతఁడెవఁడో కాఁడు—

వానిపేరు దెలిసికొనుటకు నీవు ప్రయత్నించుచున్నావా?...... అతఁడు గిరిధరలాల్!..... అదేమి? ఆపేరువినుటకే ఆశ్చర్యపడుచున్నావు! ఎఱ్ఱ తేలూ!...నీవు పీపిల్సుపార్కులో నొకనిని హత్యచేసితివి—అతఁడే గిరిధర లాలనుకొంటివి—కాని యాతఁడు గిరిధరలాల్ కాఁడు. గిరిధరలాలును బోలినవానితోడల్లుని నీవు హత్యచేసితివి—గిరిధరలాలు నీచేత హత్య కావింపఁబడిన గంగారామ్‌చెర్మనువలె నీయోడమీఁద దాచఁబడిన ఆ తపాలసంచికొఱకే ప్రయత్నించినాఁడు. ఆ సంచిలో గిరిధరలాల్ తండ్రికి సంబంధించినకొన్ని యుత్తరములున్నవి. హత్యకావింపఁబడిన గంగారామ్ చెర్మన్‌యొక్క తండ్రికి సంబంధించిన యుత్తరములుకూడ కొన్ని యున్నవి. అవి తమవంశగౌరవమునకు భంగకరములగు లేఖలగుటచేత వానినెట్లయిన సంగ్రహింపవలయునని వారిరువురు నొకరికిఁదెలియకుండ నొక రీనౌకను బ్రవేశించిరి. పాపము! గంగారామ్‌చెర్మనునకుఁ బూర్తిగా నీసంగతి తెలియును. తెలిసియుండియు నాతఁడు రక్షకభటుల కెఱిఁగించుటకు సమ్మతింపలేదు—అంతపాలసంగారమున్నది. ఈనౌకలో దాచఁబడిన తపాలసంచిలోనిలేఖలను బయటఁబెట్టుట కాతఁడంగీకరింపలేదు—అందుచేతనే నీవిషయమై మిన్నకున్నాఁడు—అరవిందము టౌకపర్యాయులు...జగదీశుని దెసఁదిలకించినాఁడు—

“జగదీశబాబూ! మిస్. శంపాలత—అనఁగా గంగారామ్‌చెర్మన్ యొక్క సహోదరిసైతము—ఆలేఖలను సంగ్రహించుటకే యీయోడ మీఁద బ్రవేశించినది—” అని పలికినాఁడు.

బెంజిమన్—అరవిందు నవలోకించుచు—“ఇదిగో! వస్త్రదారుఁడా! ముందీమాటకు సమాధానమిమ్ము—ఇపుడు గిరిధరలాలెక్కడున్నాఁడు? ఆతఁడీనౌకలో నెట్లుప్రవేశించినాఁడు?” అని యడిగినాఁడు.

"అతఁడు—ఈనౌకమీఁదనే నెవ్వళ్లాలలోనున్నాడు—లేఖలతో నున్న తపాలసంచిని సంగ్రహించి అందు వసతి శ్రీమీయొక్క పేరుప్రతిష్ట లకు భంగమును గలిగించు నుత్తరములను దించివేయవలయుననియే మాటువేసియుండెను రాత్రులయందు రహస్యముగ సంచరించుచుండెడివాఁడు. పగలుమాత్రము కానవయంతేనో యంత్రాగారములో దాఁగియుం డెడివాఁడు—రాత్రులయందు—సిబ్బంది లోనున్న చిన్నగదిలో రహస్యముగాఁగా ప్రవేశించి ఆహారపదార్థములను సంగ్రహించుచుండెడివాఁడు—నీవు తన కంటబడుదువేమో, నిన్ను హానిచేయవలయునని యాతఁడనేకప్రయ ములు ప్రశ్నించినాఁడు."

"అగును—ఆహా! .. .... అరిందముబాబూ! ఇప్పు డాతపాలసంచి యేమయినది? ఎచ్చటనున్నది?"— అని బెంజమన్ ప్రశ్నించినాడు.

"ఎర్రతేలూ! నీకు తపాలసంచి కావలెనా? .. .. ఇదిగో ...... నాఅంగీజేబులోనే యున్నది. గిరిధరలాల్ దీనియునికిని తెలిసికొని నా కెత్తి గించినాడు"—అని మాటలుపలుకుచు నరిందముడొక యెర్రనిసంచిని బయటబెట్టినాఁడు.

దానిని జూచుటతోనే—ఎర్రతేలయిన బెంజిమెనుయొక్క మన స్సెట్లున్నదో మాపాఠకులు గ్రహింపవలయునేకాని — మేము చెప్పుటకు వీలులేదు—

"అరిందముబాబూ! దానినిటు తెమ్ము — దానికొఱకే మేమంద ఱము, అన్నివిధములఁ బ్రయత్నించుచున్నాము"—అని బెంజిమెన్ — ముందునకు పిస్తోలుతోఁగూడ లంఘించినాఁడు. వానితోనున్న క్రైస్తవ

యువకులుగూడ నాయుధములతో సరీందమును జుట్టుముట్టుచుండిరి. తోడనే—అరీందముఁ డాసంచిని, ప్రక్కనున్న రంధ్రముగుండా మహో జ్జ్వలముగా మండుచున్న ఇంజను రూములోనికి విసరివేసినాఁడు — ఆసంచి మంటలో దహింపఁబడినది! ఎవరేమిచేయగలరు? బెంజిమెన్ — పండ్లు పటపట కొఱుకుచు — చుఱచుఱఁ జూచుచు నరీందము నుద్దేశించి —

"మూర్ఖుఁడా! దేనిని నాప్రాణాధికముగా భావించి, సంగ్రహిం చుట కెన్నిపాట్లు పడుచుంటినో, దానిని నీవు మంటలో బడవేసితివి — కానిమ్ము. మీరందఱును ముబొరాద్వీపములోఁ జావవలసినదే! ఈనౌక లో కోట్లకొలది రూప్యముల విలువగల ఆభరణము లనేకములున్నవి — వాని నన్నిటిని నేను సంగ్రహింతును — ఈనౌకలోనున్న వారందఱును మరణింపవలసినదే!......మిస్. శంపాలత సౌందర్యవతి! ఆమెమాత్రము చావరాదు — నాకు స్వాధీనము కావలయును—" అని పలుకుచు బెంజిమన్—తనభటులతో జగదీశుని అరీందముని — వారిగదిలోఁబెట్టి తలుపు మూయవలసినదని చెప్పెను. వారట్లుచేసిరి. గదిలోఁ బ్రవేశిం చిన పిమ్మట—జగదీశుఁడు నిట్టూర్పుఁ బుచ్చెను—

"అరీందము బాబూ! ప్రభుత్వోద్యోగి కెట్టి పాడుబుద్ధి పుట్టి నది?" అనెను.

"జగదీశ్! నీవు పొరఁబడుచున్నావు—ఈతఁడు సైనికోద్యోగి యయిన బెంజిమన్ కాఁడు—అసలు బెంజిమననువాఁడు—ఉపకార వేతనము పుచ్చుకొని విదేశములందు ప్రశాంతజీవనముం గడపు

చున్నాఁడు. వానిపేరుతో వ్యవహారించుట తనకు క్షేమకరమని యెర్ర తేలుగాఁ డట్లు చేయుచున్నాఁడు—జమీందారు శ్రీనివాసుఁడు—శరశ్చంద్రబోసు—రఘునాధజీ—ఈముప్వురును గూడఁ దపాలసంచి లోని లేఖలను సంగ్రహించుటకే యీనౌకమీఁద ప్రయాణమును సాగించుచున్నారు—అతిపాలసంచి 13 వ నెంబరు గదిలోనున్నట్లు రఘునాధజీ గ్రహించినాడు. దానిని సంపాదించుట కాతఁ డందులోఁ బ్రవేశించినపుడే ఎర్రతేలుగాడు పాపము వానిని హత్య చేసినాఁడు.”

“అరిందము బాబూ! ఇపు డింక మనగతియేమి? నౌకనుండి తప్పించుకొని పాఱిపోవుట కవకాశములేదు—మనమందఱము బలవంత ముగా నీనౌకతోఁగూడ నగాధజలములలోఁబడి మరణింపవలసినదేనా?”

“జగదీశ్! నీకు భయములేదు—ఈగదిలో నీబల్ల క్రిందనున్న పెట్టెలో ‘బ్రాడ్ కాస్టు’ యంత్రమున్నది—లెమ్ము—దానిని బయటకుఁ దీసెదను—మననౌక కొక మైలుదూరములో ప్రభుత్వమువారి యుద్ధ నౌకయున్నది—అం దాయుధపాణులగు సిపాయిలు పెక్కు వేలమంది కలరు. నే నానౌకాధిపతితో మాటలాడితిని—నేను బ్రాడ్ కాస్టు ద్వారా వారికి సహాయ మవసరమని చెప్పుటయే తడవు!” అని పలుకుచు నరిందముఁడు బ్రాడ్ కాస్టు యంత్రమును బయటకుఁ దీసినాఁడు.

* * * * * *

రమారమిపై కథ జరిగిన పిమ్మట వారమునినములు గడచినవి—వార్తాపత్రికలన్నిటిలోను సాలవీనునౌకలో నెర్రతేలుగాఁడు పట్టువడినాఁ డనియు—13 వ నెంబరుగదిలోనే “బ్లాక్ మెయిల్” (తపాలానంచి) కను

పించినదనియు వ్రాయఁబడినది .....ఒకనాఁటి సాయంకాలము శర చ్చంద్రబోసు జమీందారు శ్రీనివాసునితోఁగూడ బొంబాయినగరము లోనున్న జగదీశబాబు భవనమున కరిగినాఁడు. ఆసమయమున జగదీశ బాబునకును—శంపాలతకును వివాహమతి వైభవముగా జరుగుచున్నది. అయ్యిరువురుగూడఁ బెండ్లిచేత నాహ్వానింపఁబడి సత్కరింపఁబడిరి. వధూవరులనాశీర్వదించి తాంబూలాదులనుగైకొని వెళ్ళిపోవుచు—

“అబ్బా! అరిందముఁడ సాధారణ ప్రజ్ఞాధురంధరుఁడయ్యా! ఇంతకు రహస్యమంతయు 13 వ నెంబరుగదిలోనున్నది— మనముకనుగొనలేక పోయితిమి” అని నవ్వుకొనిరి.

సంపూర్ణము.

# ప్రేమః కౌతుకః హత్య.

## ( పరిశోధక కథ )

టెలిఫోనుగంట గణగణమ్రోగినది— మలాడ్ పోలీసుస్టేషనులో నున్న సార్జెంటుజోన్సు రిసీవరునుదీసికొని "హల్లో! ఎవరది? నేను— సార్జెంటువిలియంజోన్సుఆఫ్ మలాడ్ పోలీసుస్టేషన్— మాట్లాడుచున్నది" అనినాడు.

"అయ్యా! త్వరితముగా రావలయును. శాండీహార్స్టుబ్రిడ్జిదగ్గఱ- బీటునెంబరు 13 కొంచెము విచిత్రదృశ్యము—"

"విచిత్రదృశ్యమా? వివరముల జెప్పరాదా? అచటనేమిజరిగినది? జవాబుచెప్పవేమి—అచ్చటనేమిజరిగినదంటే—?"

మఱల నిశ్శబ్దము. ఆవల నా ఫోనుక్రిందబడినశబ్దము — టెలిఫోనువైర్ తెగగోసిన 'క్లిక్' మనుశబ్దమువినిపించినది. సార్జెంటుజోన్సు సర్కిల్ యినస్పెక్టరు అమృతలాలునుబిలిచి— "బీటునెంబరు 13 శాండ్ హార్స్టురోడ్డుబ్రిడ్జిదగ్గర నేదోజరిగినదట—చూచిరమ్ము" అనినాడు.

ఆనా డాదివారము. సాయంకాల మైదుగంటలవేళ — విజనమై యున్నరోడ్డు ననుసరించి మోటారుసైకిలుపై నమృతలాలు శాండ్ హార్స్టుబ్రిడ్జికి పువెళ్ళుచున్నాడు. ఎల్లెడల నావరించియున్న నిశ్శబ్దము నామోటారుసైకిలుధ్వని భేదింపసాగినది. రోడ్డుకిరువైపుల మామిడి— మున్నగుతోటలు—కీచురాలనిస్వనము — పక్షులకలకలారవములు—యువ

న్నియుగాక—జనసంచారములేని యాప్రశాంతప్రదేశము — చౌర్యము, హత్యమున్నగునవి నిర్భయముగ చేయదగినస్థల మిదియనితోపజేయుటచే అమృతలాలు కొంచెముజాగ్రతగ నిరువంకలజూచుచు పయనముసల్ప సాగినాడు. ఏదియెట్లున్నను — ఆదృశ్యము — ప్రకృతీకాంతసోయగము మూర్తీభవించిన యామనోజ్ఞదృశ్య మాతనిచిత్తమున కుల్లాసముగొలు పకపోలేదు.

అమృతలాలు తిన్నగా శాండ్‌హరస్టురోడ్డు బ్రిడ్జిదగ్గఱ, మోటారుసైకిలు నాపి, క్రిందకుదిగి, ఏదైన కనబడునేమో యని క్రిందికి వంగి చూచినాఁడు. పదినిమిషములు గడచినపిదప బొంబాయిసిటీ పోలీసు స్టేషను నుండి మలాడ్ పోలీసు స్టేషనుకు అతఁడు "బ్రిడ్జిక్రింద నొక మనుజుని మృతకళేబరమున్నది. డాక్టరుకు, పోలీసుకు రిపోర్టుచేసినాను" అని టెలిఫోనులోఁ జెప్పినాఁడు.

ఇట్లు చెప్పి, అమృతలాలు కాలము వ్యర్థపుచ్చక ఆనాఁటి సాయంకాలముననే 5—30 గంటలకుఁ దిరిగి శాండ్‌హరస్టు బ్రిడ్జికడకుఁ బోయి, సైకిలునాపి, బ్రిడ్జిక్రిందకుఁ బోయినాఁడు. వంతెనకుఁ క్రిందుగా సూర్యకాంతి యేమియులేదు. సాయంసంధ్యాతిమిరచ్ఛాయ లప్పుడే గోచరించి, యచటి నిర్జనత్వమునకుఁ దోడై, మఱింత భయము నాపాదించుచుండ — అమృతలాలు — ఒక పొదచెంత బోరగిలపడియున్న యామృతునిఁ జూచినాఁడు. అతఁడు ముప్పదివర్షముల ప్రాయముగల వాఁడై యుండునని గ్రహించినాఁడు. శిరోజములు చక్కగా సంస్కరింపఁబడియున్నవి. కనులు మూతపడియున్నది. ధరించిన పంచి, ఆఘారము సిల్కుది—రక్తసిక్తములై యున్నవి. చేయి ముఖమున కడ్డముగానుఁచు కొనుట—ఏదో పెద్దదెబ్బనాపుకొనుటకనితోఁపఁజేసినవి. అమృతలాలా చనిపోయినవాఁడు వంతెన పైనుండి క్రిందఁబడియుండునా యని సందియ

మందినాడుఁ గాని యది నిరాధారమైనదని—జాగరూకతతో నాకళే
బరమును పరీక్షించినపిదప గ్రహించినాఁడు. ముఖముపై చాకుతోనో—
బాకుతోనో యెవరో బలముగా గాయము చేసి యున్న దతఁడు చూచి
నాఁడు. అతఁడు ఘటించిన ఆఘాతము గాఢముగా నున్నదనుటేగాక సంపూర్ణ
ముగా చితికిపోయి ముందుభాగము లేకుండనున్నది. ముందుభాగమేమై
నది? ఆచోట్ల ముందుభాగము కొఱకు చూచునేమో యని అన్నితలా లచట
నున్న పొదలు—గుబురుగా పెరిగియున్న తీవలు పరిశీలించి చూచినాఁడు
గాని యతని ప్రయత్నము నిష్ప్రయోజనమైనది. ఆ మనుజుని హత్యారహ
స్యము భేదింపఁదగు సూత్రమేమియుఁ దోఁచక కర్తవ్యవిమూఢుఁడై
యుండ నొక మోటారుకారుశబ్దము వినిపించినది.

ఆకారునుండి యిరువురుదిగి క్రిందకు వచ్చినారు. ఒకరు డాక్టరు
జోసి. మఱొకరు డిప్యూటీసూపరింటెండెంటు ఆఫ్ పోలీసు నవజీవన్
మెహతా. డాక్టరుజోసి హత్యచేయబడినవాని కళేబరమును బరీక్షించి
నాఁడు. డాక్టరుజోసి, పోలీసుసూపరింటెండెంటును సంబోధించి 'ఇది ఆత్మ
హత్యమాత్రము కాదు. హత్యయని నిర్ధారించిచెప్పుటకును వీలులేదు.'
అనినాఁడు.

డాక్టరు అతని జేబులు వెదకినాఁడు. ఒకగడియారము కన్పించినది.
దానిగొలుసుకనబడలేదు. సూపరింటెండెంటు నవజీవన్ మెహతా వం
తెనపైకివెళ్ళి ఆశవము కనిపించినచోట పరీక్షించినాఁడు. అచటి యినుప
బద్దెలమీఁద రక్తపుమచ్చలున్నవి. క్రిందకూడ నక్కడ రక్తపుమచ్చలు గోచ
రించినవి. అతఁ డన్నితలాలును, డాక్టరుజోసినిపిలిచి, సంబంధిత స్థాన
ప్రదేశమునుజూపినాఁడు. అన్నితలాలు నచటనేయుండ నియమించి
సూపరింటెండెంటు, డాక్టరును 'మఱికొందరుపోలీసులతోగాని మనపని
నెఱవేరదు. ఇప్పుడేవచ్చెద' మని వెడలిపోయినారు. కారు నగరమునసమీ
పించుచుండగా నొకయువకుఁడు కారునాపుమని చేయెత్తినాఁడు. కా

మైయున్నది—పొడుమురంగు నెక్టై కనబడినవి. నేను పది—పదునో కండుగంటలకుఁదిరిగి వెళ్ళి చూచుసరికవి లేవు' అనినాడు—

'ఈవిషయము మొదటనే పోలీసుకెందులకు జెప్పలేదే?' దని సూప రెండెంటుప్రశ్నించినాఁడు—

'ఏమో—'

'నీవు సిల్కుకోటు కాన్పించలేదా?'

'నేనుచూడలేదు-గాని కోటునెవరుచూచినారో వానినెఱుఁగు దును. అతనిపేరు దౌలత్ రాం ఈరక్తపుగుంట కొంత యావలనొక సిల్కుకోటు కనబడినదట. దానిని దౌలత్ రాం గొనివచ్చుచు దారిలో నున్న మాగారేజిలోనికివచ్చి, చెప్పినాఁడు. అతఁడే యదార్థముగాఁ బోలీసుస్టేషనుకు టెలిఫోనులోఁ జెప్పుమనిసలహా నిచ్చినాఁడు.'

'అతఁడు ఆచనిపోయినవాని జేబులలో నేమున్నదో వెదక లేదా?'

"వెదకి యుండవచ్చును. అవును. నాకు జ్ఞాపకమున్నది. ఆ జేబులం దేదో యుత్తరమున్నదని కూడ చెప్పినాఁడు."

స్టేషనుకుఁ బోయి, వెంటనే హత్య కాఁబడినవాని మృతకళేబర మును శాండ్ హార్స్టు వంతెనదగ్గఱనుండి తెప్పించి, ఫొటో తీయించి నాఁడు. ఆటైరుగూర్కులు కూడ ఫొటో తీయబడినవి. అనుమానా స్పదమైయున్న ప్రదేశములు—కాలివ్రేళ్ళ యానవాళ్ళు మున్నగునవి దొరకవచ్చునని—ఫొటోలుతీయించినారు. స్టేషనులో మఱల సార్జెంటు జోన్సు—నవజీవక్ మెహతా—డాక్టరు సోసీగార్డ్ యెదుట యిన్స్పె క్టరు అమృతలాలు గంగారామును ప్రశ్నిఁచగా నతఁడిట్లు చెప్పినాఁడు—

"దౌలత్ రాం ఉదయముననే తన కారులో నామార్గమున వచ్చుచు, దారిలో నొకచోఁబడియున్న సిల్కుకోటును దీసి, కారు బ్యాక్ సీటులోఁ బడవైచినాఁడట. నాదగ్గఱకు వచ్చినపుడు—నాకు

రక్తసిక్తములై బాకు—సుత్తి—ఆ ఘారములోని యర్థభాగము — నెక్లై కాన్పించినవని చెప్పినపుడు కోటు మాట స్ఫురణకు రాఁగా, నాకోటు నీవలకుఁదీసి చూచినాఁడు. ఒక జేబులో నొకయుత్తరమున్నది అది లక్ష్మిచైన్ లెటరు. (ఈయుత్తరముల ప్రచారము మనదేశములో నిపుడు చాల చోట్లనున్నది. అది చేరినవాఁడు మఱల నట్టివే ఏఁడు లేఖలు వ్రాసి, తనస్నేహితులందేమగురికిఁ పంపవలెను.) కవరు మాత్రము లేదు."

'ఆలేఖయెవరికి వ్రాయఁబడినదో—లేక యెవరినుండివచ్చినదో వారి చిఱునామా లేదా?' యని అమృతలాలు ప్రశ్నించినాఁడు.

'ఏవో కొందఱ పేర్లున్నవిగాని, నాకు జ్ఞాపకములేదు. ఆ పేర్లలోఁ జాలమంది శాంగ్లి నివాసస్థులని మాత్రము చెప్పఁగలను.'

'ఈ దౌలత్‌రాం నివాసమెచట?' నని సార్జెంటుజోన్సు ప్రశ్నించినాఁడు.

'దాదరులో—గిరిగాంబాక్ రోడ్డులో 105 వ నెంబరు సౌధమున వసించును.'

వెంటనే అమృతలాలు దౌలత్‌రాంనుండి—సిల్కుకోటు, లక్ష్మిచైనులెటరుల విషయము తెలిసికొనుటకై వెళ్ళినాఁడు. నవజీవన్ మెహతా గొలుసులేని గడియారము, రక్తముతోనిండియున్న బాకులఁ బరీక్షించినాడు—రక్తయుక్తమైయున్న బాకువలనగాని, గొలుసులేని యాగడియారమువలనగాని, ప్రతిమోటారు టూరుపెట్టెలోను ఉండు సుత్తివలనగాని, హంతకుని యాచోకీయేమియుఁ దెలియదని గ్రహించినాఁడు. వ్రేలి ముద్రలవలనఁ గొంతవఱకు కార్యము సాధింపవగునుగాని, యది యంతత్వరగా జరుగదు. దాదరులోనున్న దౌలత్‌రాం కడనున్న లక్ష్మిచైన్ లెటరువలననే హత్యారహస్యము భేదింపనగునని నిశ్చయించుకొనినాఁడు.

మృతకళేబరమును పరిశీలనపూర్వకముగాఁ జూచి, డాక్టరుసోనీ యీవలకువచ్చి, యిట్లనినాఁడు—

"హత్య పండ్రెండుగంటలకుఁ బూర్వము జరిగియుండవలెను. తలపగులుటవలన మరణము సంభవించినది."

హత్య—దారుణమైనహత్య. ఈహత్యగావించుట కెవరో దుర్మార్గుఁడు – నరపిశాచి, విజనమై భయావహమైయున్న యాప్రదేశమున దాగియుండవలెనని వారు నిశ్చయించినారు. ఇంతలో దాదరునకు పోయిన యిన్‌స్పెక్టరు అమృతలాలు వచ్చినాఁడు. అతను రుధిరముతో నిండిన సిల్కుకోటును, లకీనులెటరును సూపరెండెంటునవజీవన్ మెహతా ముందిడినాఁడు. రక్తపు మఱకలు తప్పించి, మఱేమియు రహస్యము భేదింపఁగల సూత్రములు లభించలేదు. ఆయుత్తరములోని పేళ్ళలో జాలమంది, గంగారాం చెప్పినట్లు శాంగ్లి నివాసస్థులవేయైయున్నవి. యిన్‌స్పెక్టరు అమృతలాలును – సార్జెంటుజోన్సును "శాంగ్లి వెళ్ళి, ఆయుత్తరములోని చిఱునామాదారులనందఱను గలసికొని, యీయుత్తరమెవరికివచ్చినదో కనుఁగొను" డని చెప్పి, పంపినాఁడు.

వారిరువురను శాంగ్లికి బంపి, నవజీవన్ మెహతా యింటికిఁ బోయి, భోజనముచేసి, తన 'హిల్‌మన్' కారులో శాంగ్లికి బయలు దేఱినాఁడు. సూపరెండెంటు నవజీవన్ మెహతా శాంగ్లి చేరునరికి రాత్రి పదిన్నరగంటలైనది. అతడాయూరిలోఁ బ్రవేశింపగనే యిన్‌స్పెక్టరు అమృతలాలు కలిసికొని, "ఈతఁడు శాంగ్లి పోలీసు యిన్‌స్పెక్టరు గోవర్ధనలాలు. మీతోఁ జెప్పవలసినది కొంతయున్న" దనినాఁడు.

శాంగ్లి పోలీసు యిన్‌స్పెక్టరు గోవర్ధనలాలు డి-వై. యస్. పి. తో నిట్లు చెప్పినాఁడు—

'ఈహత్య జరిగిననాటికిఁ బూర్వము రాత్రి యీయూరనొక చిత్రము జరిగినది. ఒక ప్లిమత్ కారు వచ్చినది. ఆకారులో డ్రైవరు

వారిర్వురును ప్రమదాదేవి యింటికివెళ్ళి తలుపు తట్టినారు ఆమె వయస్సు ముప్పదివత్సరములుండును. ఆమె తలుపు తెఱచి, పోలీసు ఇన్‌స్పెక్టరులను జూచి—భయకంపితయైనది. అమృతలాలు—హంతకుఁడైన వాని జేబులోనుండి సంగ్రహించిన యుత్తరముఁ జూపి, "ఈయుత్తరము మీరు వ్రాసినదా?" యని యడిగినాఁడు.

ప్రమదాదేవి మఱింత కంగారుపడి, "ఏమి? ఆయొక్క లేఖయే మిగిలిపోయినది. దాని నతనికిఁ బంపుట మహాపరాధమైనదా? అది శాసనవిరుద్ధమని—నే నెఱుఁగను—క్షమింపుఁ" డని బ్రతిమాలసాగినది—ఆమె విలోచనములు విచారబాష్పప్రపూర్ణములైనవి. అమృతలాలిట్లనినాఁడు—

'అమ్మా! ఏలయిట్లాత్రమునొందెదవు. మీరీలేఖనెవరికివ్రాసినారో యతఁడు కొంచెము ప్రమాదావస్థలోనున్నాఁడు. అతనినిగుఱించి నీకుఁదెలిసినంతవరకు చెప్పుదువని యిచ్చటికివచ్చినారము. నీకేమియు భయములేదు. అతనియుదంతము నీవేమెఱుఁగుదువో చెప్పుము.'

ప్రమదాదేవి యిట్లనినది—

'నన్నుక్షమింపఁగోరుచున్నాను. ఈవిషయములో మీకు నేనేమియు సాహాయ్యముచేయజాలను. నే నీలేఖను మెర్వాంజీకమ్మినాను. అతఁ డీతనికిఁబంపియుండవచ్చును — మెర్వాంజీ యింటిపేరు నాకుఁదెలియదు. అతఁ డెచటనివసించునోకూడ నేనెఱుఁగను. అతఁడు తఱచుగా కంజీభాయియను మార్వాడితోఁదిరుగుచుండును. ఆకంజీభాయి నిరంతరము వారకాంతనర్మదసౌధమున నుండును—'

'ఆమెనివాస మెచ్చట?'

'దేవాలయమువీధిలో—'

అమృతలాలు — గోవర్ధనలాలు— [illegible] కంజీభాయిని కలిసికొనుటకువెళ్ళినారు. వారికి మెర్వాంజీగాని, కంజీభాయి

గాని కాన్పించలేదు. నర్మదకనబడినది. మెర్వాంజీ బజారువీధిలో 17 వ నెంబరు యింటిలోనుండునని నర్మదచెప్పినది. తిన్నగా పోలీసులుబజారు వీధిలోని 17 వ నెంబరుయింటికివెళ్ళి తలుపుతట్టినారు. మెర్వాంజీ మానెక్ జీ వారికికాన్పించినాడు. అమృతలాలు [illegible] చూపినంతనే మెర్వాంజీ యిట్లనినాడు—

'ఇతనిపేరు మోహన్‌దాస్ — స్వరూప్‌చందు. బొంబాయిలో వాటరువర్క్సుయింజినీరుగ బనిచేయుచున్నాడు. కొలదిమాసముల నుండి యీతడు శాస్త్రిలో నివసించుచున్నాడు. అంతకుపూర్వము కల్యాణిలో నుండెడివాడు. నాగ్రేంటుకోన్సుకోరగా నతడుమోహన్‌దాస్ స్వరూప్‌చందు ఆకారప్రకారాదులవర్ణించినాడు. ఆయానవాళ్ళు సరిగా హత్యచేయబడినవానికి సరిపోయినవి. అంతియేగాక మెర్వాంజీ మఱొకవిషయముచెప్పినాడు—'

'మోహన్‌దాసుకు దిస్టివాచిలేదు. వెండిగడియారము—గొలుసు లేనిది — జేబులోనుంచుకొనును — అతనికింకను వివాహముకాలేదు. వయస్సు సుమారుముప్పదియైదు సంవత్సరములుండును. అతడు చాల ధనమునార్జించియున్నాడు. అతనితల్లి సూరత్తులో నివసించుచున్నది. అతనినందఱును మంచివాడందురు. ధనమువిరివిగా కర్చుపెట్టుచుండును—అడిగినవారికి లేదనక — వారికష్టములందు సాహాయ్యపడుచుండును.'

'అతనికెవరైన విరోధులున్నారా?'

'లేరు—నాకుదెలిసినంతవఱకు [illegible] చెప్పగలను—'

ఆతడింకేమియు జెప్పలేదు

'మోహన్‌దాస్ యెచ్చటనివసించుచున్నా'డని నాగ్రేంటు ప్రశ్నింప మెర్వాంజీ 'అతడు శాస్త్రి [illegible]' పాఠమున నొక గదినద్దెకుదీసికొని యందే నివసించుచున్నాడని బదులు పలికినాడు.

అందుకొని హోటలుకుబోయి యజమాని రాంనారాయణ్ సేటునుగలిసికొనినారు. శనివారమునాఁటిసాయంకాలమునుండి యు నతడు కనబడలేదని యజమానిచెప్పినాడు. జరిగినదంతయు అమృతలాలు — డి. వై. యస్. పి. నవజీవన్ మెహతాకు టెలిఫోనులో దెలుప నతడు 'వెంటనే మెర్వాంజీని బిలచుకొని రండు—శవమును గురించి యతఁడు గలడేమో తెలిసికొనుటమంచి' దనినాడు.

ఒకగంటలో వారు మెర్వాంజీని పోలీసుస్టేషనుకు దోడ్కొనివచ్చి నారు. అతఁడు మోహన్ దాసుదే యామృతకళేబరమని గుర్తించి నాఁడు. తరువాత నవజీవన్ మెహతా వారితో శాంగ్రీకిబోయినాఁడు. హోటలుయజమాని రాంనారాయణసేటును గలిసికొని యాతని యను మతిగొని నవజీవన్ మెహతా, అమృతలాలు, సార్జెంటుజోన్సు— మోహన్ దాస్ గదిలో బ్రవేశించినారు.

ఆగది యత్యంతమనోహరముగ నలంకరింపఁ బడియున్నది. ఖరీదైన కుర్చీలు—సోఫాలు — ఎలెక్ట్రిక్ ఫాను మొదలైన యాగదిలోని సామగ్రి మోహన్ దాసు మహోన్నత భవనములో గూడిన జీవన మొనరించు చున్నాఁడని వారిని గ్రహింపఁజేసినది. టేబిలు పైఁ గొన్ని యుత్తరము లున్నవి. ఒక యుత్తరమతనికిఁ దల్లిచే వ్రాయఁబడినది. రెండవలేఖ యడుగున రతన్ బాయి యను సంతకమున్నది ఆ టేబిలుమీఁదనున్న నవలలో రతన్ బాయిచే వ్రాయబడిన మఱియొక లేఖనుకూడ వారుచూచి నారు. ఆరెండు లేఖలును 'నాప్రియ మోహన్ దాస్' అని సంబోధింప బడియున్నవి. ఉత్తరములోని విషయములఁబట్టి ఆమె ఫణీంద్రనాథ సింహా అనువాని భార్య యని వారు గ్రహించినారు. అతి జరూరైన వ్యవహారమునుగూర్చి సంభాషింపవలెనని రతన్ బాయి లేఖలోనున్నది.

ఆలేఖలో నాతనికేదో యుపాయము పుట్టిల్లనున్నదని జాగ్రతగ నుండవలసినదని హెచ్చరించినది.

ఆమె పేరు లక్కీచైను లిస్టులోనున్నందున నవజీవన్ మెహతా చూచినాఁడు. ఆపేరుపైన 'ఫణీంద్రనాథసింహా. ఇంజనీరు' అని యున్నది. మెస్సాంజీ 'రతన్ బాయి' ఫణీంద్రనాథసింహుని భార్య. వారిరువురును శాంతాక్రుజ్‌లో నివసించుచున్నారు. భార్యాభర్తలనను వారు కలిసిలేరు. ఆమె యతనిని వదలివేసినది. ఒకలేఖ యామె శాంతాక్రుజ్ నుండియు, మఱొకలేఖ కల్యాణినుండియు వ్రాసినట్లు పోస్టు ముద్రలవలన బోధపడినది.

డి-వై. యస్. పి. నవజీవన్ మెహతా ఆనాటిరాత్రి సూరత్‌లోనున్న తల్లికి — ఫణీంద్రనాథసింహా భార్య రతన్ బాయి — మోహన్ దాస్ హత్యావృత్తాంతము తెలియఁబఱచినాఁడు. ఆమఱునాడు - పాప — మిరువురుకాంతల నేత్రములనుండి దుఃఖాశ్రువులు కాలువలుగట్టినవి. ఒకరు మోహన్ దాసు జననీ — మఱొకరు రతన్ బాయి—

రతన్ బాయి — మోహన్ దాసు చిత్తరువు చూచుకొనుచు — నెంతసేపో యేడ్చి, యేడ్చి "అతఁడే — ఫణీంద్రుఁడేవెళ్ళి — తన కక్ష తీర్చుకొనియుండు" ననుకొన్నది.

* * * * * *

నవజీవన్ మెహతా, సార్జెంటుజోన్సు, యిన్స్పెక్టరు అమృతలాలు — ఎల్లరు దినదినము నతినిగూఢముపొందుచున్న మోహన్ దాసు హత్యారహస్యము భేదించుటకు బద్ధకంకణులైరి. నవజీవన్ మెహతా శాంగ్లీలోని పరిస్థితులఁ దెలిసికొనినాఁడు—కల్యాణినుండి కొలఁది మాసములకుఁ బూర్వమే మోహన్ దాసు శాంగ్లీగ్రామమునకువచ్చి నివసింపసాగినాఁడని తెలిసికొనినాఁడు. బొంబాయిలో నతఁడు వాటరు వర్క్సు యింజనీరుగానున్నాఁడు. అతనికి చాలజీతము. పనివారలకు — డిపార్టుమెంటుకు వేతనముల విషయమై కొన్ని మనస్పర్ధలు జనించినవి. అట్టి స్పర్ధలలో నుద్యోగభారముచే — పనివారలను వ్యతిరేకముగనే

మోహన్‌దాసు పనిచేయుట ధర్మము. ఆతనికీ కార్మికులతోడి తగవులో మెర్వాంజీమున్నగువా రనుకూలముగ వర్తింపసాగినారు. ఆస్పర్ధలింకను ముగియకపోయినను — మోహన్‌దాసును హత్యగావించునంతటి దౌష్ట్యమునకుఁ గార్మికులు పాల్పడుదురాయని నవజీవన్ మెహతా సంశయించినాఁడు. ఒకవేళ యంతపనికి పాల్పడినను పాల్పడవచ్చును.

మెర్వాంజీ హృదయమును మిత్రుని హత్యావృత్తాంతము కలంచినది—ఆతఁడు కూడ శక్తికొలఁదిగ హత్యాపరాధ రహస్యోద్భేదనమున రక్షకభటశాఖకుఁ దోడ్పడసాగినాఁడు.

నవజీవన్ మెహతా చిత్తమునమాత్ర మనుమాన మొక్కనిపై జనించినది. ఎవ్వరికిని—ఆతనిపై ననుమానము జనింపలేదు. ఆయనుమానము నవజీవన్ మెహతా, సార్జెంటు జోన్సు, యిన్‌స్పెక్టరు అమృతలాలుర హృదయములందే తప్ప—తదితరుల చిత్తములం దుదయింపలేదు—తదితరులకుఁ దెలియలేదు. అతఁడు రతన్‌బాయి భర్త ఫణీంద్రనాథసింహా. ఆతడుకూడ బొంబాయివాటరువర్క్సులోనే పనిచేయుచున్నాడు. ఆతడు ఎలెక్ట్రికల్‌యింజనీరుగా నున్నాడు.

నవజీవన్ మెహతాకు—రతన్‌బాయి, మోహన్‌దాసుకు లిఖించిన ప్రణయలేఖలలోని యమృతమయములై, మధురములై, శృంగార రసరంజితములై యొప్పు నాప్రేమయుక్తములైనపదములు మఱపునకు రాలేదు. ఆలేఖలలో రానున్నయాపదనుగూర్చి యామె మోహన్‌దాసును హెచ్చరించినది. తానెట్టి యాపన్నస్థితిలోను నున్నట్లుతోఁచలేదు! ఆలేఖ యీతనికందుట—హత్యజరుగుట—వీనివలన హత్యాపరాధ మెవరుచేసినారాయని—యిందులో ఫణీంద్రనాథున కేమైన సంబంధముండకపోవునాయని రక్షకభటశాఖోద్యోగు లనుమానింప నవకాశ మొదవుచున్నది.

ఎవరు మోహన్‌దాసును హత్యగావించినారు? రతన్‌బాయి నాథుఁడా? ఏదోమిషచే రాపించి శాండ్‌హర్‌స్టుబ్రిడ్జిదగ్గఱ కలిసికొని ఫణీంద్రనాథుఁ డాతనిఁజంపియుండునా! శాస్త్రిలోగాని—శాంతాక్రూజ్ లోగాని రతన్‌బాయి—మోహన్‌దాసులు కాముకవ్యాపార నిమగ్నులై యున్నారను వదంతి యిసుమంతయులేదు. రతన్‌బాయి — ఆమెభర్త కలిసియుండుటలేదు. ఆతఁ డామెకు నెలకు ముప్పదిరూపాయలు పంపు చుండెను—తనకామెభార్య కానట్లెసంచరించుచుండెను. ఆమెప్రవర్తన ముతోఁ దనకేమియు సంబంధములేనట్లు చరించుచుండెను.

నవజీవన్ మెహతా — అమృతలాలు రిర్వురు నేడెనిమిది పర్యాయములు ఫణీంద్రనాథసింహాను కలిసికొనినారు. ఆతఁడు వారితో ముక్తసరిగ మూఁడుమాటల నాడెడినాఁడు. తనకును మోహన్‌దాసు కును డిపార్టుమెంటలుగా నభిప్రాయభేదమున్నదనినాఁడు—తాను పని వారలకై పోరాడ — అతఁడె డిపార్టుమెంటుకొఱకే పనివారలకు వ్యతి రిక్తముగ పనిచేయుచున్నాఁడని చెప్పినాఁడు. అంతమాత్రమున నతనిని హత్యచేయునంతటి క్రోధము తన కెపుడును కలుగలేదని పలికినాఁడు. తనభార్యను — ఆమె తన పోషణనుండి వెడలిపోయిన పిదప — తాను జూడలేదని వచించినాఁడు.

ఆతని వర్తనము నవజీవన్ మెహతాకు మఱింత జటిలముగఁ దోఁచినది. తన భార్య — మోహన్‌దాసు లొకరి నొకరు మనసార ప్రేమించుకొన్నారని తెలిసినచో ఫణీంద్రనాథసింహా యేమిచేయునా యని నవజీవన్ మెహతా యోచించినాఁడు. ఆతఁడు తనకు మోహన్‌దాసును గూర్చి తెలిసినది సంపూర్ణముగఁ దెలుపుటలేదని పోలీసువారు గ్రహింపలేకపోలేదు. ఆతఁడు తన భార్య మోహన్‌దాసునెడ ప్రణయ ముగ్ధయైయుండెనని తెలిసి — చంపఁ బ్రయత్నించునంతటి క్రోధోన్మత్తుఁ డగునాయని వారు సంశయించినారు. మోహన్‌దాసు వివాహితులైన

స్త్రీలను తన యెడ ప్రసన్నులఁ గావించుకొనుటకై వారి వెంటబడి యు ల్లరిపాలగు నంతటి దుర్భాగ్యుఁడు కాఁడని నవజీవన్ మెహతా శాంగ్లీ నివాసస్థుల కతని యెడఁగల గాఢాభిమానమునుబట్టి నిశ్చయించి నాఁడు. నిజముగా మోహన్ సేకోమలియందైన బద్ధానురాగుఁడై యున్నచో నది యతిజాగ్రతగ గూఢముగనే యుంచబడినది. రతన్ బా యి మోహన్ దాసులనుగూర్చి యూరెండు గ్రామములలోను రవంతైన ప్రజల కనుమానములేని సందర్భమున నామె యెందులకతని కేదో మ హావిపత్తు ఘటిల్లనున్నదని వార్తనంగిచ్చినది?

నవజీవన్ మెహతా కేమియుఁ దోఁచలేదు. మోహన్ దాసు హ త్యతో నతనికి ఫణీంద్రనాధుని కెట్టిసంబంధమును లేనట్లే విధమున చూచినను కనబడుచున్నది. రక్తపు గుంటలోని మోటారు టైరుగుర్తులు జ్ఞప్తికిరాగా నవజీవన్ మెహతా ఫణీంద్రనాధుని కారుటైరుల బరీక్షించి నాఁడు. టైరులమార్పులేక కనబడని విధాన-అరిగిపోయియున్నవి. ఆత నిపైఁగొలది దినములవఱకు ననుమానము నిలుపుట సమంజసము కా దని, నవజీవన్ మెహతా గ్రహించి, యితరములైన యుపాయముల నన్వేషింప సాగినాఁడు—

మోహన్ దాసు నివసించె శాంగ్లీ లంచ్ అండ్ మీల్సుహోము యజమాని రాంనారాయణసేటు వారి కొకింత యవకాశము కల్పించి నాఁడు మోహన్ దాసు ఒక్క రతన్ బాయితోనేగాక చాలమంది స్త్రీ లతో యువతులతో చనవుగ సంభాషించునని వారిలో సంఘములో చన వుగఁదిరుగు రిఫారమిస్ట్ సొసైటీ గరల్సును చదువుకొన్న యావనవతు ల నపుడపుడు తన కారులో నెక్కించుకొని షికారు వెళ్ళునని సినీమాల కుఁ గొంపోవుచుండునని నవజీవన్ మెహతాతోఁ జెప్పినాఁడు.

వారిపేర్లను నవజీవన్ మెహతా తననోట్ బుక్ లో వ్రాసికొని నాడు—

ఒకరు దేవాలయమువీధిలో నివసించుచున్న జానకి అనుపిల్ల—ఆమె హైస్కూలులో స్కూల్ ఫైనలుక్లాసులో జదువుచున్నది. ఆమె సోదరుఁడు మోహన్ దాసుమిత్రాలు—

మఱొకరు శాంతకుమారి. ఆమెకాలేజీలో బి. యస్. సి. చదువుచున్నది. ఆమెతండ్రికి మోహన్ నాయెడ చాలాభిమానము. ఆమె నతనికిచ్చి పెండ్లిచేయుట కతఁడభిలషించుచుండెను.

ఇంకొకరు సినీమానటి తార—

వీరుగాక మిగిలినది లేడీడాక్టరు సరళాదేవి యల్. యం. యస్.

జానకి—శాంతకుమారి—వీరలను నవజీవన్ మెహతా కలిసికొనినాడు. వారు విద్యావినయసంపన్నులగుటచే—వారికి హత్యాపరాధముతో సంబంధమున్నదనుట కేవ లసంభవముగదోచినది. నవజీవన్ మెహతా సినీమాస్టార్ తారను గలిసికొనుటకు వెళ్ళినాడు. ఆమెస్టుడియోకు వెళ్ళియుండెనని పరిచారిక చెప్పినది. లేడీడాక్టరు సరళాదేవి పదిరోజులై గ్రామాంతరమున కేగి యానాడే తిరిగివచ్చుటచే—యామెపై ననుమానముండుటకూడ సమంజసము కానేరదనిగ్రహించి నవజీవన్ మెహతా యింటికిఁబోయినాఁడు—

మఱునాఁటి యుదయమున నవజీవన్ మెహతా కారులో శాంగ్లికిఁ బోయి, సినీమానటి తారను కలిసికొనినాఁడు—ఆమె యిట్లు పలికినది—

"అతఁడు నాతో యిష్టముగ నున్న మాట వాస్తవము—అతని హత్య నాహృదయమున కపారమగు వ్యధ కలిగించినది."

"ఈతని వలెనే మీతో కలిసి మెలిసి తిరుగువా రెవరైన నున్నారా?" యని డి-టె. యస్. పి ప్రశ్నించినాఁడు—

ఆమె యొకింత యాలోచించి "ఉన్నాఁడు. అతని పేరు సురేంద్రుఁడు—వకీలుగనున్నాఁడు. అతని నివాసముకూడ నీయూరనే" అనినది.

"వారిరువురకు నిన్ను గూర్చి మనస్పర్థలేవైనయున్న వేమో చెప్పఁగలవా?"

ఆమెముఖమైఖరిలోనిమార్పును గమనించి నవజీవన్ మెహతా 'నీకొఱకు—నీప్రణయమయకటాక్షవీక్షణముకొఱకై వారిరువురును—సురేంద్రమోహన్‌దాసు లెపుడైన పోరాడినారా?' అని యడిగినాడు.

'లేదు. అతనితో నెచటికిని వెళ్ళవలదని సురేంద్రుడుగాని, ఈతనితోపోరాదని మోహన్‌దాసుగాని నన్నెన్నడును నిరోధించలేదు. అదిగాక వారిద్వరు నొకరెఱింగియుందురనికూడ యనుమానింపజాలను.'

'హత్యజరిగిననాఁటిరాత్రి—శనివారమునాడు సురేంద్రుఁ డెచట నుండెనో చెప్పగలవా?'

'ఆహా! ఆరాత్రినేనును, సురేంద్రుడును బొంబాయిలోని క్రిష్ణా సినీమాకుబోయి తిరిగివచ్చుసరికి చాలనాలస్యమైనది.'

నవజీవన్ మెహతా కీయపరాధరహస్యము మఱింతనిగూఢముగ దోచినది. అతనిజీవితములో నింతటివిపరీతసంఘటనము ఇంతవఱకు కనివినియుండలేదు. ఏరహస్యములున్నను మోహన్‌దాసు తనతోనే పదిలముగ నతడు పరలోకమునకుఁ గొంపోయినాడు

రతన్‌బాయి నొకసారి వీలైనచో వచ్చి తన్నుకలిసికొనవలెనని నవజీవన్ మెహతా ఫోనులోచెప్పగా నామె తనరాక రహస్యముగానుంచవలెనని—తాను మఱునాఁటియుదయమున పదిగంటలకు శాంతాక్రూజ్ నుండి బయలుదేఱి 12 గంటలకు గ్రాండ్‌హోటలులోనుందుననీ—తన్నచటకలిసికొనవలసినదని తిరిగి టెలిఫోనులో జెప్పినది. ఇంతలో మఱొక విశేషమాతనికి దెలిసినది. హత్యజరిగిననాటిరాత్రికి బూర్వపురాత్రి శాంగ్లిలోగాన్పించిన ప్లిమత్ కారు 1930 మోడలని ఆకారు సాంత దేశాయియను యిన్సురెన్సుకంపెనీమేనేజరుపేర రిజిష్టరైనదని తెలిపినది.

ఆవసంతదేశాయి లేమింగ్టనురోడ్డులో 128 నెంబరుసౌధమున నున్నాడని తెలిసినది.

నవజీవన్ మెహతా సార్జెంటుజోన్సును ఫొటోతీయబడిన యా కారుపైరుమార్కుల గమనించి కనులప్పిన — లోపలరక్తపుమచ్చ లేవైనకానవనగుచో వానింబరీక్షించి యజమాని వసంతదేశాయినికలిసి కొనిరమ్మని పంపినాడు. మఱునాటి యుదయమున సార్జెంటుజోన్సు ఫొటో గ్రాఫులదీసికొని బయలుదేఱినాడు.

అనుకొనినట్లే రతన్‌బాయిని నవజీవన్ మెహతా ఉదయమున 11 గంటలకు గ్రాండ్‌హోటలులో గలిసికొనినాడు. ఆమె యసాధారణ సౌందర్యవతి. వయస్సు సుమా రిరువదిమూడు లేక యిరువదినాలుగువత్స రములుండును. ఆమె తనకును — మోహన్‌దాసునకును సంవత్సరము నుండి పరిచయముకలదని చెప్పినది. తనభర్తయును, మోహన్‌దాసును ఒకేచోట యుద్యోగముల నిర్వహించుచున్నారనినది. ఆమె యిట్లు వచించినది—

"నాభర్తకుఁ దెలియకుండ — రహస్యముగ నీతనితో మైత్రి నెఱపి కృతకృత్యను గాలేను. నాభర్తవలన నాకు సుఖములేని సౌఖ్య రహితమైన సాంసారిక జీవనముకంటె విడిగా నుండుటయే శ్రేయస్కర మని తలంచి, నాభర్తతో, జెప్పినపిదపనే — నేనా యిలువీడివచ్చి, మఱొకవీధిలోఁ గాపురమున్నాను. మోహన్‌దాసు యువకుఁడు— అపారముగ ధనము నార్జించుచున్నాఁడు. మంచినీటిప్రవాహమువలె ధనము ఖర్చుపెట్టును — నాకిష్టుఁడు."

"మోహన్‌దాసుతో నపుడపుడు సినీమాలకుఁ బోవుచుండుట- కలిసి మెలిసి ప్రవర్తించుట — నీభర్తకుఁ దెలియునా?"

"తెలియును. నాభర్తయెడ నాకు జనించిన యసంతృప్తి— మోహన్‌దాసునెడ నుదయించినప్రేమ — వీనింగూర్చి — మోటుగా

నేనే యొకసారిగ చెప్పకపోయినను — దాఁచియుంచుట బాధాకరముగ నుండుటచే క్రమక్రమముగాఁ దెలియునట్లు చేసితిని.”

“ఆతడు మీయిరువురు బద్ధానురాగులై యున్నారని గ్రహించియు, తప్పని—కూడదనియని వారించక యూరకుండెనా?”

“ఏమియు ననలేదు. మొదట—నీతఁడు మాయింటికివచ్చినపుడు—నాతో మాట్లాడునపుడు యేమియు లెక్కచేయనట్లే నటించెను గాని, నే నాతని రక్షణమునుండి విడిపోయి, ప్రత్యేకముగ నివసించుట మొదలిడిన పిమ్మట నొకటి రెండుసార్లు నాకు ధనముఁబంపుచు—తానును—మోహన్‌దాసును స్నేహితులుగనేయున్నారమని యొక లేఖలో వ్రాసినాఁడు. అపుడు—ఆతఁడు కొంచెము ఖేదముతోనో లేక కోపముతోనో యట్లు వ్రాసెనని యనుమానించినాను. నాథర్త నీమధ్య నే నెన్నఁడును చూడలేదు. పది పండ్రెండు దినములకుఁ బూర్వమొక సారి మోహన్‌దాస్ నన్ను చూచుటకు శాంతాక్రుజ్ వచ్చినాఁడు. నాథర్త కూడ యొక లేఖలో—డివార్డుమెంటలుగా—కార్మికులవేతనముల విషయములోఁ దనకును—మోహన్‌దాసునకును మనస్పర్థ లేర్పడినవని వ్రాసినాఁడు. మోహన్‌దాసు ఆవిషయమును నపుడు నాతో, జెప్పగా, నేను “భయములేక ధైర్యముతో నెదుర్కొనుము. నీవే యీపోరాటమున గెలుతువు” వంటిని—

“ఆతని ముఖమేలనో వెల్లదనమునొందియున్నది. ధైర్యముగనే పోరాడుట నిశ్చయుఁడై యున్నను, తనకు జయము నబ్బుట యసంభవముగా కన్పట్టుచున్నదనినాఁడు.”

“అట్లయిన నీవెవరిపై నీయపరాధము మోపుదు?” వని నవజీవన్ మెహతా యామె నడిగినాఁడు—

“ఎవరిని? ఇం కెవరిని? నాథర్తనే యనుమానింతును ”

‘అట్లయిన నీనాథుడే మోహన్‌దాసును జంపియుండునా?’

'అతఁడే స్వయముగ హత్యగావించియుండకపోవచ్చునుగాని ఆతని హత్యావిషయమై పోలీసులకు దెలిపిన దానికంటె యెక్కువగా దెలియును. ఆతఁడేమియు సంబంధము లేకుండనున్నచో — ఎవరు హంతకులో యది తప్పక యతనికి దెలియును. ఆతని బుద్ధి వక్రమైనది. ఆతఁడు తన యకార్యమునకు దగిన శిక్షననుభవింపవలయును.'

ఇట్లుపలికి యామె మోహన్‌దాసును దలంచుకొని యేడ్చినది—

'ఒకవేళ వాటరువర్క్సులోని పనివారెవరైన నీహత్యలో బాల్గొనియుందురా?'

'ఏమో వారేకానేల? పాతికరూపాయలిచ్చినచో పదిమందిని చంపుటకు సిద్ధపడు కుటిలాత్ములెందరు లేరు? ఎవనికిని దెలియకుండవచ్చి యీహత్యచేసి తమదారిని తాముపోవుట సులభమేగదా? ఆతని కేదో యుపాయము ఘటిల్లనున్నదని — నాభర్త నాకువ్రాసిన లేఖనుబట్టి గ్రహించి జాగ్రతయని హెచ్చరించుచు మోహన్‌దాసుకొక లేఖవ్రాసినాను. కాని నాలేఖచేరుట — అతనిహత్య యొకనాఁజరిగియుండునేమో నేనింకను రెండురోజులీహోటలులోనేయుందును. మీకేమైన యవసరమున్నచో నన్ను మఱలకలిసికొనవచ్చును—'

నవజీవన్ మెహతా స్టేషనుకుబోయినాడు — అమృతలాలును ఫోనులోబిలిచి 'నీవు శాంగ్లికిబోయి పోలీసుయిన్‌స్పెక్టరును రాంనారాయణసేటును కలిసికొనిరమ్ము. వచ్చునపుడు శాంటాక్రాజ్‌కుబోయి ఫణీంద్రనాథ సింహానుకూడకలిసికొనిరమ్ము' అనినాడు. అమృతలాలు శాంగ్లికిబోయి ముందుగాహోటలుకుబోయినాడు. యజమాని రాంనారాయణసేటు లేనందున—నమృతలాలు కొంతసేపువేచియుండదలచి కాఫీ త్రాగసాగినాడు. ఇంతలో నా తినుబండారముల సప్లయిచేయు హీరాలాలు అమృతలాలునుద్దేశించి 'బాబూ! మోహన్‌దాసును హత్యగావించినవాడు దొరకినాడా?' యనియడిగినాడు—

'లేదు. దొరకనున్నా'డని యమృతలాలు బదులుపలికినాడు—

'పాపము—శనివారముునాటి తెల్లవారుఝామున—అనగా దెల్లవారినచో నాదివారమునాడు—చూచినాను మోహాన్ దాసును. అతడు వచ్చినపిదప—విర్వురకు కొంచెముతీవ్రవసంభాషణజరిగినది — అప్పుడే వెడలిపోయినారు. వారిరువ్వురునుకూడ—అదే కడపటిసారి'

హీరాలాలుమాటలు అమృతలాలును సంభ్రమాశ్చర్యవిహ్వలునిగావించినవి. ఆ మాటలుమరొకక్రొత్తపంథనుసూచించినవి. అమృతలాలిట్లనినాడు—

"హీరాలాల్! ఏమంటివి? మోహాన్ దాసు నాదివారమునాఁటి యుదయమునఁ జూచినావా? ఎన్నిగంటలకు?"

"మోహాన్ దాసు శనివారమునాఁటి రాత్రి ఒంటిగంటకు వచ్చినాఁడు—తెల్లవారుఝామున నైదుగంటలైనను గాకమునుపే మఱొకఁడు వచ్చినాఁడు. పొట్టిగా—బక్కపలుచగనుండును—ఇరువురును కొంతతడవు మాట్లాడినారు. నేను లోనికి పనిమీఁదఁ బోయి తిరిగి వచ్చుసరికి వారులేరు. వెలుపల కారు కదలిన శబ్దము వినిపించినది—మోహాన్ దాసు సరిగా మీరు కూర్చుండిన చోటనే కూర్చుండి యున్నాఁడు. అంతే—"

అవునంతే, చాలును. మోహాన్ దా సల్లన హోటలునుండి పృష్ఠ్యగహ్వారమునకుఁ బోయినాఁడు—ఆపొట్టివాఁడే హంతకుఁడై యుండును. రతన్ బాయి భర్త—ఫణీంద్రనాథసింహా? పొట్టివాఁడు కాఁడు—కాని ఒకవేళ—అతఁ డాపొట్టివానికి ధనమిచ్చి చంపించి యుండరాదా?

"ఆపొట్టివాఁ డెవరు? అతని పేరేమి? అతఁ డేమిచేయుచుండు" నని అమృతలాలు హీరాలాలును ప్రశ్నించినాఁడు. హీరాలా లిట్లు బదులు పలికినాఁడు—

"ఆతని పేరు నాకుఁ దెలియదు. యజమానిని యెఱుఁగుదును. అతఁడు టిఫిన్ తీసికొనుటకై యిప్పుడపు డిటకు వచ్చుచుండును"

"అయితే హీరాలాల్! నా యిద్దరను సంభాషించినపుడు — నీవేమైన వింటివా?"

"ఆహా! ఎవరో పిల్లను గూర్చి తగవు లాడుకొనినారు. ఆమెను వారిద్దరును ప్రేమించినట్లున్నది. ఇద్దరికిని మాటపోయినదా యని తలంచినాను. ఆమె స్టుడియోకు వెళ్ళినదని — ఫిల్ములోనటించుచున్నదని కూడ సంభాషణమున వినిపించినది."

వెంటనే అమృతలాలుకు సినీమానటి తారస్ఫురించినది — హోటలు యజమాని యింకను దానిమున టెలిఫోనులో నమృతలాలు, నవజీవన్ మెహతాను బిలిచి, జరిగినదంతయుఁ జెప్పఁగా, నతఁడిట్లనినాడు —

"అమృతలాల్! ఇది చాల ముఖ్యమైన సూత్రము. రతనబాయి భర్తనుకలిసికొనవలదు. ఈపొట్టవా డెవరో కనుగొనుము. వీలైనచో తారనుకూడ కలిసికొని యేమిజరిగినది — తెలుపుము. నేను నీవార్తకై యత్యధికమగు నాత్రముతో వేచియుందును.'

నవజీవన్ మెహతాను ఫోనులో నాఁడు టుజోన్నుపిలిచి 'వసంత దేశాయికాన్పింపలేదు. లేమింగ్టనురోడ్డునుండి యతడు మద్రాసువీధికి బోయినాఁడట — అచటకూడ దరియాప్తుచేసినాను. ఆతడు వారముదిన ములకురానని యేదో గ్రామాంతరమునకు యిన్సూరెన్సుబిజినెస్ మీద వెళ్ళినాడట — పోలీసుస్టేషనుయిన్స్పెక్టరేదో పనిమీద వెళ్ళినాడట. సాయంకాలమువఱకురాడు' అనిచెప్పినాడు —'

'సరే. సాయంకాలము మఱల వెళ్ళి యిన్స్పెక్టరును కలిసికొని- వసంతదేశాయికి కారున్నదా? ఉన్నచో నదియేమోడలుదో చూచి ఆ వసంతదేశాయి పొట్టిగా బక్కపలుచగనుండునాయని యడిగి మఱల ఫోనులోజెప్పి యింటికి బొమ్మనినాడు.

ఇంతలో అమృతలాలు నవజీవన్ మెహతాను టెలిఫోనులోఁ బిలిచి, యిట్లు చెప్పినాఁడు—

"హల్లో! డియర్ సార్! ఇప్పుడే రాంనారాయణసేట్ వచ్చి నాఁడు—ఆతనితో సంభాషించినాను. హీరాలాలు చెప్పిన గుర్తులను పోలిన పొట్టి మనుజుఁడు తఱచుగా హోటలుకు వచ్చుచుండుననియు, నతని పేరు తనకుఁ దెలియదనియు, వాక్సహాలు కారుపైఁ బయనము సల్పుచుండుననియు, నతఁడు మోటారుకారులఫరములో నేదో యుద్యోగము సేయుచున్నాఁడనియు రాంనారాయణసేట్ చెప్పినాఁడు—'

'సరే. అతఁడెవరో కనుగొనుము—తారనుకలిసికొనుము. ఆమె మోహన్‌దాసు, సురేంద్రుఁడనువకీలు తనయెడల ననురాగయుక్తులై యున్నారని చెప్పినది. మోటారుకారులఏజంటుకూడ నీప్రేమకు పాత్రమైనవాఁడొక డుండగా నసత్యమేలచెప్పితివని దబాయించి యడుగుము. చాలత్వరితముగ మెలగవలెను. నీకు సాహాయ్యముచేయుటకై నేనేసిద్ధముగనున్నాను. శాంగ్లీలోను—బొంబాయిలోను నున్న మోటారుకారుల ఫరములను గారేజీలనువెదకుము. నీవు ఆతనియానవాళ్ళ దెలిసికొన్న వెంటనే ఫోనులో నన్నుబిలువుము. నేనువెంటనే వచ్చెదను.'

అమృతలాలు సరేయని, తనకారుపై బ్రథమమున సినీమానటి తార యింటికిఁబోయినాఁడు. ఆమె యప్పుడే స్టుడియోనుండి తిరిగి వచ్చినది. మెల్లగా సంభాషణమధ్యమున నమృతలాలు "తారా! మొన్న మా డి. వై. యస్. పి. తోనే యసత్యము చెప్పినావే— మోటారుడీలరు కూడ నీప్రణయాకాంక్షియై యిచటకు వచ్చుచుం డునని—నిన్ను క్రొత్తక్రొత్త కారులపై షికారు గొనిపోవుచుండునని వినినాఁడట." అనఁగా, నామె యొకింత తొట్రుపడి—"అవును, మఱచినాను. మధుసూదనలాలను మోటారు సేల్సుమన్ కూడ నా కొఱకు వచ్చుచుండును. ఆయనతో నివియన్నియుఁ జెప్పుటకు సిగ్గు

పడి, చెప్పనైతిని. క్షమింపుఁడు—అతఁడు మాత్ర మొకటి రెండు సార్లు మోహాకారుదాను యెడ నా కపారమైన ప్రేమ కలదని యధిక్షేపించినాఁడు కూడ. వారందఱును భ్రమరతుల్యులు కదా!" యనినది—

"అవును. నీవు మధువువైనపుడు వారు భ్రమరము లగుటలో దోసములేదు. కాని అతని నివాసము—"

"శాంగ్లిలోనే—మీకిపు డిట దొరకదు. బొంబాయిలోనే యుండును."

అతడుపనిచేయుఘరముపేరు తార చెప్పజాలకపోయినది. అతడు పొట్టిగానేయుండుననికూడచెప్పినది—శనివారమునాటిరాత్రి తార సురేంద్రునితో సినీమాకుబోయి తిరిగివచ్చినపిదప నీతనితో జాలసేపు కారునెక్కి షికారువెళ్ళి 12 గంటలకుతిరిగివచ్చినామనినది—

అటనుండి యమృతలాలు శాంగ్లిలోని మోటారుకారుడీలర్లకడకుబోయి దరియాప్తుచేయగా నా వర్ణనకు సరిపోవు మధుసూదనలాలు ఈస్ట్రర్ను మోటార్సుకంపెనీలో బనిచేయుచున్నాడని తెలిసినది. బొంబాయిలో ప్రిన్సెస్‌వీధిలోనున్న యీ యీస్ట్రర్ను మోటార్సుకంపెనీకడకు బోయిఅమృతలాలు మేనేజరుగానున్న ఎక్స్వర్తు టాంసనునగలిసికొని వారందఱును వర్ణించినప్రకారముచెప్పి మధుసూదనలాలనుసత డందులకు సరిపోవునాయనియు, నాపేరుగలవాడు మీకంపెనీలో బనిచేయుచుండునా యనియు నడిగినాడు—

'మీరుచెప్పినవర్ణనకు సరిపోవుమొకానిక్కు మాకడనున్నాడు. ఆతడు యింగ్లీషుబాగుగా మాట్లాడును. అందుచే నీమధ్య తీటికవేళలందు కారుల డిమాంస్ట్రేషన్‌కు—విక్రయమునకుగూడ నతనిని నియమించి జీతముహెచ్చుచేసినాము. వానికడకుగొంపోయి చూపింతును రండు—'

# ప్రేమకౌఅనుహత్య

'అతడు తఱచుగా వాక్సుహాలు మోటారులను నడుపునా?'

'అవును—వాక్సుహాలు కారులనే మేము విశేషముగ విక్రయింతుము—ఈమధ్యనే హిల్ మన్, డాడ్జి మున్నగువానిఏజన్సీకూడ తీసికొనినాము.'

అచ్చటినుండియే అమృతలాలు, సూపరెండెంటు నవజీవనమెహతాను రమ్మని టెలిఫోనుతోజెప్పినాడు. అయిదునిమిషములలో నవజీవన్ మెహతా యటకురాగానే అమృతలాలు కంపెనీమేనేజరు టాంసనుకాతని నింట్రడ్యూస్ చేసినాడు.

ముగ్గురును గారేజీలోనికిఁ బోయినారు. ఒకకారును రిపేరు చేయుచున్న పొట్టివానిని—బక్కపలుచగ నున్నవానిం జూపి, మేనేజరు "అతఁడే మధుసూదనలాలు" అనినాఁడు.

మధుసూదనలాలు వీరివంక చూచినాఁడు. ముఖముపై జాలచోట్లగీచుకొనిపోయి యున్నది. కుడికన్ను కొంచెముబ్బుగనున్నది. కంటిపైన వాచియున్నది. ఫాలరంగమునఁ గత్తితోఁ జేయుబడిన గాయమొకటి కాన్పించినది. దెబ్బ కంటికి బలముగాఁ దగిలినదికాఁబోలు కొంచెముపైగా కాంజేజీకట్టబడియున్నది. కూలికూలికి లినెన్ గుడ్డతో నతడు కన్నునద్దుకొనుచున్నాఁడు. వానిని వారు సమీపించినారు.

"కన్నుకు దెబ్బతగిలినట్లున్నదే" యనినాఁడు, నవజీవన్ మెహతా—

మధుసూదనలా లిట్లనినాఁడు—

"అవును గత శనివారమునాఁడు కారు రిపేరుచేయుచుండఁగా ముఖము జాకీకిఁ దగిలి — గాయములగుటయేగాక కంటికి దెబ్బ తగిలినది."

## ప్రేమకో ఆత్మహత్య

ఆశనివారము—తను పరిశోధనములో మోహన్‌దాస్ వా జరిగిన రోజు శనివారము నేకీభవించినవి—

"దెబ్బ తగిలి కన్ను బాధగానుండుట — శనివారమునాఁటి రాత్రి నీవు కారు నడపినపుడు నిరోధముగ లేవా?" యని అమృతలా లడిగినాఁడు.

"శనివారమునాఁటి రాత్రి నే నెచ్చటికిని బోలేదు—"

"ఆఁ! శనివారము రాత్రి నీవు వెళ్ళినావు. జ్ఞప్తికిఁ దెచ్చి కొనుము. ఏదైన కారును గొంపోవుదునని నన్నడిగినవు దనుమతి నిచ్చి తిని గాదా?" యని మేనేజరు టాంసన్ అడిగినాఁడు—

"ఆకా రెచ్చట నున్న?" దని నవజీవన్ మెహతా ప్రశ్నించగా, "అద్దెకుఁ దిరుగుటకై పంపఁబడినది — రోడ్డు చివఱనున్నది." అనినాఁడు—

"ఆకారు పేరేమి?—"

"ప్లిమత్ 1930 మోడలు"

అమృతలాలు నవజీవన్ మెహతా కనుసన్న గ్రహించి వెంటనే యటనుండి వెడలిపోయి పదినిమిషములలోఁ దిరిగివచ్చి "ఇదిగో ఆ కారు ఫోటోలు—టైరులఫొటో—అన్నింధముల నాఫొటోలతో— నాఫొటోగ్రాఫులు సరిపోయినవి.

"నీదగ్గర చాకుగాని బాకుగాని యున్నదా?"

"ఉన్నది. చాకుమాత్రమే—"

"అది యెట్టిది?"

"ఎట్టిదని నేను చెప్పగలను? బజారులోనుండు చాకుల మాదిరిదే—"

"ఆచాకు నొకసారి చూడనిమ్ము."

మధుసూదనలాలు గ్రీజుతో నిండియున్న చేతుల శుభ్రము గావించుకొని, కోటుజేబులు వెదకినాఁడు గాని కనబడలేదు—నవజీవన్ మెహతాను జూచి యతఁడు "కాదు. శనివారమునాఁటి రాత్రియే—ఆచాకు నెటనో పారవైచియుందును—జ్ఞాపకమున్నది—"

"అది చిన్నదా – పెద్దదా?" అని నవజీవన్ మెహతా దగ్గ ఱగాఁబోయి, తీక్షణముగాఁ జూచినాఁడు. మధుసూదనలాలు కంఠస్వర మున మార్పుగాన్పించినది. గాద్గద్యము వహించిన కంఠముతో నతఁడు "పెద్దదే—దాని బ్లేడ్ అయిదంగుళముల పొడవైనది"—అనినాఁడు—

"పిడి—?"

"కర్రది—కాదు—తోలుపిడి—"

ఆప్రశ్నల వెనుక నేదో దారుణమైన కథయున్నదని మేనేజరు గ్రహించినాఁడు.

"సరే – ఆచాకు శనివారమునాఁటి రాత్రి నీజేబులోనేయు న్నది. ఆదివారమునాఁటి యుదయమున నైదు గంటలకు—రక్తసిక్తమై యున్న ఆచాకును శాండ్‌హర్స్టుబ్రిడ్జిదగ్గఱ పారవైచితివి కాదా?"

"లే" దని యతఁడు కోపముతోఁ బలికినాఁడు.

"ఆఫొటోలు పరీక్షింపుడు – టైరుమార్కులు సరిపోయిన" వని యమృతలాలు పలికినాఁడు—

"దేనితో సరిపోయిన?" వని మధుసూదనలాలు ప్రశ్నించినాఁడు.

"శాండ్‌హర్స్టుబ్రిడ్జిదగ్గఱనున్న రక్తపుగుంటలో నేర్పడిన కారు టైరు యానవాళ్ళతో—నీవుచెప్పిన కారుటైరు గుర్తులు సరిపోయినవి."

"అసత్యము—"

"నిన్ను అరెస్టుచేయుచున్నాను. సరిగా – వెంకితనముచేయక స్టేషనుకురమ్ము" అని నవజీవన్ మెహతా వచించినాఁడు. మధుసూధనలా

లేమియు మాటాడలేదు. అతనిని వారు సెంట్రల్ పోలీసు స్టేషనుకు గొంపోయినారు. చేతులకు సంకెలలు తగిలింపఁబడినవి.

"శనివారమునాఁటి రాత్రి నీవు తారను దీసికొని షికారు వెళ్లి చాల నాలస్యముగ తిరిగివచ్చితివిగాదా?" యని నవజీవన్ మెహాతా స్టేషనులోఁ బ్రశ్నించినాఁడు—

"నేనేమియు బదులు పలుకను—"

"ఆమె నింటికడ దిగఁబెట్టి నీవు మూడులేక నాల్గుగంటలకు రాంనారాయణసేట్ హోటలుకుఁబోయి, మోహన్‌దాసును కలిసికొన్నావు. తరువాత మీరిద్దరు కారు నెక్కి శాంగ్లీ హార్బరు బ్రిడ్జివైపు వెళ్ళినారు. అచట వానిని చంపినావు. అవునా?"

"నేనేమియు బదులు చెప్పనంటినిగాదా? ఎందులకు మీరు ప్రశ్నలవర్షము నాపైఁ గురిపించి మీరు బాధపడి, నన్ను బాధింతురు?" అనినాఁడు మధుసూదనలాలు.

"ఆ ప్లిమత్ కారులోఁగూడ రక్తపుమరకలున్నవి. హత్యానంతరము శవమును తిరిగి తీసికొనివచ్చి— ఆ బ్రిడ్జిక్రింద పడవైచితివా?" యని అమృతలాలడిగినాఁడు—

జవాబులేదు. ఎవరెట్లడిగినను, మధుసూదనలాలు మౌనముద్రాంకితుఁడై, తల పంకించుటతప్ప మఱేమియుఁజేయుటలేదు—

నవజీవన్ మెహాతా శాంగ్లినుండి రాంనారాయణసేటును హీరాలాలును రావింపఁగా, వారు మధుసూదనలాలును గుర్తించినారు. తెల్లవారుఝామున నతఁడే వచ్చి, మోహన్‌దాసుతో తీవ్రసంభాషణకు గడంగినాఁడని—యిరువురు కారునెక్కి వెళ్లినారని హీరాలాలు సాక్ష్యమిచ్చినాఁడు. తార వచ్చి "మధుసూదనలాలుతో ఆనాఁటి రాత్రి షికారుగా కారులోఁ దిరిగి, తిరిగి—12 గంటలకు యింటికి దిరిగి వచ్చి

లోమని—అతఁడెటకో వెళ్ళిపోయినాఁడని—తనతో నున్నపుడు ముఖముపై గాయములులేవని—కన్ను కూడ శుభ్రముగనున్నదని చెప్పినది.

ప్లిమత్ కారు మఱల పరీక్షింపఁబడినది. మైనముతో అద్దిన యానవాళ్ళు కోర్టులో దాఖలు చేయఁబడినవి. రోడ్డుపై దొరికినదని గంగారాం తెచ్చిన చాకు, సుత్తి—మోహన్‌దాసు కోటు, కారులోని కుషను—పరిశోధనార్థము జనరల్ హాస్పిటలు డాక్టరు కడకుఁ బరీక్షార్థ మంపబడినవి. వానిపై నున్న రక్తపుమఱకలు మనుష్యుని రక్తమేయని నిర్ధారణముచేయఁబడినది. ఆసుత్తి బాకు తనవేయనుట తప్ప మధుసూదన లాలు తదితర ప్రశ్నలకు సమాధానమీయ నిరాకరించెను.

శాంగ్లి మేజస్ట్రీటుకోర్టులో విచారణ జరగినది. మేజస్ట్రీటు సాక్షుల నందఱిని బరీక్షించి, కేసు సెషన్సుకు కమిట్ చేసినాఁడు జడ్జి కోర్టులో విచారణ ప్రారంభమైనది. సెషన్సుకోర్టునుండి సెంట్రల్ జెయిలు కతఁడు గొంపో బడినపుడు సార్జెంటుజోన్సు మధుసూదనలాలు ననుసరించి యున్నాఁడు

అంతవఱకును యేప్రశ్నకును సమాధానమీయ నిరాకరించిన మధుసూదనలాలాకస్మికముగ నిట్లనినాఁడు—

"మిస్టర్ జోన్సు! ఇంక నాలసించిన లాభములేదు — మోహన్ దాసును నే నుద్దేశపూర్వకముగ హత్య చేయలేదు. నాప్రాణరక్షణార్థము పోరాడునపు డతఁడు చనిపోయినాఁడు."

అతఁడు సరిగా చెప్పలేదు. ఒకదానికి నొకదానికి సరిపోవుటలేదు. మొదట తాను మోహన్‌దాసును దేవాలయమువీధిలోఁ గలిసికొంటినని చెప్పినాఁడు—అది యనృతము. మఱల నతడుఁ మోహన్‌దాసును హోటలులోనే కలిసికొంటిననియు, నతఁడపుడు విస్కీ త్రాగియుండె ననియుఁ జెప్పినాఁడు—అదియు నసత్యమే. మోహన్‌దాసు మద్యపానాసక్తుఁడుకాఁడని యందఱును జెప్పినారు. తరువాత తానును — అతఁ

డును కారునెక్కి క్లాండ్‌హారస్టుబ్రిడ్జివైపు పోయినారమని యరమైలు దూరములోనుండగా మోహన్‌దాసు క్రోధోద్రిక్తుఁడై తన్నుకొట్టినాఁడని—అప్పటినుండి పోరాట మారంభమైనదని వచించి నాఁడు—

"మీరిర్వురును తారవిషయమై దెబ్బలాడినారుకాదా?"

"కాదు. అతఁడు కూడ ఆమెను ప్రేమించినాఁడని నే నెఱుఁగుదును. ఆమెకు నాయెడలనే గాఢానురాగము. ఒక్కొకప్పుడు జీతము నష్టముకైన నంగీకరించి యామెను కారుపైఁ ద్రిప్పెడివాఁడను."

'అట్లైన తారకొఱకుమీరు పోరాడలేదా?'

"దేనికొఱకు పోరాడినామో చెప్పలేను. అతఁడు క్రోధోన్మత్తుఁడై నన్ను చంపఁబోగా నేను అతని ఆహారముపట్టి లాగితిని. నెక్లై, ఆహారములోని యర్థభాగము నా చేతిలోని కూడివచ్చినవి. ఆత్మరక్షణార్థము నేనపుడు చాకు నుపయోగింపవలసి వచ్చినది.'

'సుత్తి యెందులకు?'

'దానినికూడ నతనిపై గిరవాటు వైచితిని. ఇరువురము అరగంట వఱకు భయంకరముగ పోరాడితిమి. తరువాత పెద్దదెబ్బతగిలి, మోహన్‌దాసు క్రిందబడిపోయినాఁడు. దూరమున నాపిన కారు హెడ్ లైట్ల వెలుగుతక్క మఱేమియు వెలుతురులేదు. అప్పటికింకను జీఁకటిగనే యున్నది. ఎవరు ఓడిపోయినను వారికి మరణము తప్పదని పోరాడితిమి. ఆదెబ్బతగిలి యతఁడు క్రిందబడిపోయినాఁడు. మఱల లేవలేదు. నేను దగ్గఱకుపోయి చూచినాను. రక్తపుగుంట యేర్పడినది. ఇంక నాలసించినచో లాభములేదని తలంచినాను. అతఁడు చనిపోయినాఁడు. కారు నటకు నడపుకొని వచ్చినాను. అపుడే టైరుమార్కులారక్తపుగుంటలో పడి మీకు సూత్రముగ సాహాయ్యము చేసినవి. అతని మృతకళేబర

# ప్రేమకోంటకహత్య

...యు బన్నింగు రోడ్డుపైనుంచి, వంతెనకడకుఁ గొంపోయి, శవమునెత్తి బ్రిడ్జి క్రిందఁబడునట్లు విడిచినాను. భయకంపితుఁడనై, కారునెక్కి గారేజీకి వెళ్ళినాను. తరువాత జ్ఞాపకమువచ్చినది. నాసుత్తి బాకు నచట పారవైచివచ్చినానని, మఱల వెళ్ళి చూచితిని. అవిలేవు. రక్తసిక్తమైన మోహన్‌దాస్ ఆఘారములోని యర్ధభాగము, నెక్‌టై కాన్పించినవి. వానిని తీసికొనిపోయి యొకచో పాతిపెట్టినాను—'

సెషన్సుకోర్టులో మధుసూదనలాలిదియంతయు జెప్పినాఁడు. ఆత్మరక్షణార్థమీపనిచేసితినన్న మాట ఋజువుకాలేదు. పైరుమార్కులే యాతడు హంతకుడని నిరూపించినవి. మొదటనిట్లనినను, తుదిదినమున తానే హంతకుఁడనని యొప్పుకొనినందున, జడ్జి మధుసూదనలాలుకు ద్వీపాంతరవాసశిక్ష విధించినాఁడు. ఎందులకు హత్యచేసినావని యడుగ నతడు సమాధానము చెప్పలేదు. సినీమానటి తారప్రేమకతఁడు పాత్రమైనాఁడను నీర్ష్యయే యతని నిందులకుఁ బురికొల్పియుండునని కోర్టు జూరీ అభిప్రాయ మిచ్చిరి.

ఈవిధముగా హత్యారహస్యము భేదింపఁబడకున్న నిరపరాధి యగు రతన్‌బాయి భర్త ఫణీంద్రనాథసింహాపై నీయపరాధ మారోపింపఁబడి యుండెడిదికదా!

సంపూర్ణము.

---

శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి.

# పరిశోధన.

గ్రంథకర్త:—జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు.

స్నేహితులతో లండను వ్యాపారముచేసి ఏడులక్షలు సంపాదించినాడు. ఓడప్రయాణములో స్నేహితునిచంపి ధనమపహరింప దలచిన శరచ్చంద్రుడు గొప్పవాడా—తనకేసు యీవకీలున్న నెగ్గదని విచారించి దబ్బాళ చూపించి లొంగకున్న హత్య యొనరించిన నాగభూషణుడు గొప్పవాడా—దెయ్యముల కొంపలోనుండి ముఖస్తితో పందెము వేసిన రమాసుందరుని రక్షించిన రమేశుడు గొప్పవాడా— యెన్నిసారులో దెబ్బలుతిన్న విషయమోహన పత్తేదారు గొప్పవాడా—గొప్పవారివిప్పలన్ని దేవుడెరుగు. మహామాంత్రికుడగు రాబర్టును చూడండి. లక్షలు కష్టలేకుండానే సంపాదించినాడు. అప్పటికిని విజయమోహన పత్తేదారు విర్రవీగి బిఱ్ఱబిగిసి కయ్యములలో గెలువవలెనని పెయ్యమ్మయై పోయినాడు. నక్క జిత్తులన్నియు రమేశుని యుద్ధవ్యూహములో పనికిరాలేదు. దరిద్రము వదలినది. ఆఖరుకంతయు ఆనందము.

వెల రు 0—12—0

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# రక్తవాహిని

## లేక

# అయిదుహత్యలా?

గ్రంథకర్త:—ముద్దూరి శ్రీరామమూర్తిగారు.

అపూర్వమగు రహస్యాపరాధ పరిశోధకాఖ్యాయిక.

మోహముయొక్క విపరీత పరిణామ మనర్థదాయకమైన దనుట కీగ్రంథము తార్కాణముగా గలదు. ఒక్క తరుణీమణికై నలువు రైదుగురు మనుజు లతిస్వల్పకాలమున కాలధర్మము నొందింపబడిరి. ఎట్టి యాధారములు లభింప కున్నను గిరిధరలాలు తనబుద్ధి చాతుర్యముచే పరేంగితావగాహనముగల నేర్పుచే దోషిని గుర్తించి బంధించుటకై జరుపు యత్నమత్యద్భుతము. అసంభవములు వింతవింతలునగు యంత్రములుగాని, విచిత్ర మందిరములుగాని లేకున్నను దోషి కలకత్తా నగరమున పరిశోధకుల కనుగప్పి వర్తించుటలో జూపిననేర్పు వర్ణనాతీతము. వేయేల, చదువుటకు మొదలిడిన సాంతముగా జదువువరకును పుస్తకమును మూయజాలరు. ఈగ్రంథమునకై నేడే యీక్రింది చిరునామాకొక కార్డువ్రాయుడు.

వెల రు. 0—13—0

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి.

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి

(తాత్పర్యసహితము)

గోవిందా!

రసమయాత్మకములు, కావ్యములు, రసములు తొమ్మిది. వానికి శృంగారరసము నాయకమణి. దానికూ దైవత్వమే కృష్ణమోహనము. ఆప్రభునిలీలలు వర్ణించినకవులు చాలతక్కువ. ఈగ్రంథమునందు గ్రంథకర్త భక్తులకు శ్రీకృష్ణజననము, బాల్యచేష్టలు, శైశవక్రీడలు, కాళీయమర్దనము, గోపికావస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము, గోపికలకు తత్త్వోపదేశంబుచేయుట, రాసక్రీడలు, రాధాకృష్ణసంవాదము, గోపికాగీతలు, కంసవధ, భ్రమరగీతలు, రుక్మిణీకళ్యాణము, కృష్ణుండు జాంబవతి మొదలగు నష్టభార్యలను పెండ్లాడుట కన్నులకుం గట్టినట్లు వర్ణించినాడు. నీ వెన్నిపాపంబులు చేసినను తరింపయత్నించు నుపాయము వెనుక వను మాటకల్ల. కృష్ణనామస్మరణము ముక్తిదాయకమని నీస్నేహితులకు నచ్చచెప్పదలంచితివేని కృష్ణలీలాతరంగిణిని చూపుము.

వె. 0—12—0

వలయువారు:—

శ్రీసత్యనారాయణబుక్కుడిపో,
బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,
రాజమండ్రి.

# గొప్ప జ్యోతి

| | ర | అ |
|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | 0 | 8 |
| జాతకమార్తాండము 1భా | 1 | 8 |
| ,, 2భా | 1 | 8 |
| ,, 3భా | 2 | 0 |
| జ్యోతిషరహస్యం 1భా | 1 | 8 |
| ,, 2భా | 1 | 8 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక సంజ్ఞాధ్యాయము 1 భా | 1 | 0 |
| గణితాధ్యాయము 2భా | 1 | 0 |
| భావఫలాధ్యాయం 3భా | 3 | 0 |
| ద్వాదశభావఫలము 4భా | 2 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 6 |
| జ్యోతిష ఫలప్రదర్శిని | 0 | 10 |
| దశాభుక్తి ఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాల రత్నాకరము | 0 | 8 |
| మయివాసు, వాస్తుశిరోమణి, సనత్కుమారవాస్తు — ఈ 3 చేర్చి ఒకేపుస్తకం | 0 | 12 |
| వాస్తుసంగ్రహము | 0 | 12 |
| నవగ్రహచింతామణి | 0 | 2 |

| | ర | అ |
|---|---|---|
| శల్యవాస్తు | 0 | 12 |
| జాతకఫల మణిమంజరి 1భా | 1 | 8 |
| గర్గసంహిత | 0 | 4 |
| బృహత్పరాశరసంహిత | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రములు 1 వ భా | 1 | 8 |
| ,, 2వ భా | 1 | 8 |
| గోచారసంహిత | 0 | 12 |
| కాలామృతము | 0 | 12 |
| శిల్పిసంగ్రహము | 0 | 6 |
| ఆయుర్దాయయోగం | 1 | 0 |
| ముహూర్తదర్పణం | 0 | 8 |
| రెట్టమతశాస్త్రము 60 సం॥ పంచాగము | 0 | 12 |
| జాతక నారాయణీయం | 1 | 8 |
| స్వప్న ఫలదీపిక | 0 | 8 |
| సకలసర్వగుణ అదృష్టదీపిక | 0 | 10 |
| గౌతమసంహిత | 0 | 8 |
| వాంఛానాదీయం | 0 | 8 |
| జాతకరాజీయం | 1 | 0 |
| జ్యోతిషఫలగ్రంథము | 0 | 2 |
| శకునశాస్త్రం | 0 | 8 |
| స్త్రీజాతకం | 0 | 8 |
| యవనజాతకం | 0 | 8 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.